# నాయకురాలు

## పల్నాటి వీరచరిత్ర

శ్రీ కృష్ణదేవ [illegible]

[illegible]

ఉన్నవ లక్ష్మీనారాయణ



త్రివేణి

మచిలీపట్టణము

ఈ నాటకమునందు వచ్చు

# పాత్రలు

పురుషులు :

1. ప్రతాపుడు
2. బ్రహ్మనాయుడు
3. బాలచంద్రుడు
4. నలగామరాజు
5. నరసింగరాజు
6. మలిదేవరాజు
7. అలుగురాజు
8. కొమ్మరాజు
9. అలరాజు
10. కేతరాజు
11. ఝుట్టిరాజు
12. పొదిలె పాపన్న
13. కల్వగుంట కాశీపతి
14. కేతురెడ్డి
15. రామిరెడ్డి
16. ముతసాని పిచ్చిరెడ్డి
17. కన్నమదాసు
18. లంకన్న
19. చాకలి చందన్న
20. మంగలి మంచన్న
21. కుమ్మరి తేర్కుడు
22. అనపోతు
23. అర్చకుడు
24. సేవకుడు
25. పెద్దసెట్టి
26. బ్రాహ్మణుడు
27. గుమాస్తా
28. సుద్దులవాడు
29. చెంచునాయకుడు, చెంచులు
30. గోసాయిలు
31. సైనికులు
32. ప్రజలు

స్త్రీలు :

నాగాంబిక ( నాయకురాలు )

# అంకితము

లక్ష్మినారాయణుల కల్లుడై - యల కైలాసమున
కాశీనాథుడు శిరమున నిడుకొని - గంగ నేలినాడు
కాశీనాథునివారి వంశమున - గలిగె నొక్క ఘనుడు
నాయకురాలికి తగినభర్తని - నాగేశ్వరు డనిరి
దేశోద్ధారక నామబిరుదుడు - ధీరోదాత్తుండు
భాషాసేవయె పరమధర్మముగ - భావించెడువాడు
దేశభక్తియే దైవభక్తి యని - తెలిసిన సుజ్ఞాని
దైవదత్తమగు ధనమునకెల్లను - ధర్మకర్త ననెడు
భావముతోడను పంచిపెట్టును - ప్రజలకు నెల్లెడల
లేదని చెప్పుటె వాతప్పని దా - లేదని యెరుగండు.

ఉన్నవ లక్ష్మినారాయణులకు - ఉద్భవమొందింది
నాయకురాలని పేరుమోసిన - నాగాంబిక కన్నె
దీసైపె వున్నది తల్లిదండ్రులకు - ధీరోద్ధతురాలు
అచ్చమైన తన ఆంధ్రత్వముచే - నలరుతువుంటుంది
అందుచేతనే ఆంధ్రనాయకుడు - అందెను వియ్యమును
నాయకురాలికి ప్రియతరమైన - నాయకు డైనాడు
చిరకాలముగా వారి నేస్తము - చెన్నుమీరుగాత !

# పీఠిక

## ప్రస్తావన

శ్లో. యత్సత్యవ్రతభంగభీరుమనసా యత్నేన మందీకృతం
యద్విస్మర్తుమపీహితం శమవతా శాంతిం కులస్యేచ్ఛతా,
తద్ద్యూతారణిసంభృతం నృపసుతాకేశాంబరాకర్షణైః
క్రోధజ్యోతిరిదం మహత్కురువనే యౌధిష్ఠిరం జృంభతే.

—భట్టనారాయణమహాకవి; వేణీసంహారము.

బ్రహ్మశ్రీయుతులును, దేశభక్తులును అగు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు వ్రాసిన "నాయకురాలు" అను నీ చిన్ని నాటకమును చదివినంతనే పైసూక్తి నాకు జ్ఞాపకమువచ్చినది. కేవలము జ్ఞాపకమువచ్చుటమాత్రమేకాక, ఈ నాయకురాలియందలి ఇతివృత్తముకూడ సర్వవిధముల కౌరవ-పాండవుల దాయభాగముననైన పోరాటముతో తులదూగుచున్నది. పైగా నాటకరచయితలు రచనాసామర్థ్యమున వెల్లడిసేయించిన వాక్యములును నీ యర్థమునకు చక్కని యుపష్టంభకములుగా నున్నవి.

## కథామూలము

నాయకురా లను నీ చిన్నినాటకమునకు అసలు ఆకరము పల్నాటివీరచరిత్రము. దీనిని ద్విపదలో ఆంధ్రకవిసార్వభౌముఁడని ప్రఖ్యాతిగాంచిన శ్రీనాథమహాకవి రచించె నని లోకమున ప్రతీతి గలదు. శ్రీనాథకవిసార్వభౌముఁడు సుప్రసిద్ధుఁడై ఆంధ్రులగు ప్రతివారి హృదయములందును నిప్పటికిని యశఃకాయముతో తేజరిల్లుచున్నాడు. పంతులుగారీ గ్రంథములోని అత్యల్పమగు కథాభాగ

మును గైకొని సకృత్పఠనమాత్రముచేతనే ఎట్టి బండలైనను ఒడలు జలదరించి రసస్ఫూర్తి యగునట్టి శైలిలో దిద్దితీర్చినారు.

విస్మృతములగు ప్రతిభా ప్రాభవములు గల స్వజాతివారి నుద్బోధించి కార్యశూరులనుగా నొనర్చుటకు మహాకవులు వీర చరిత్రములను దృశ్యములుగానో, శ్రవ్యములుగానో కూర్చి, యౌచిత్యము చెడకుండ, పౌరుష పరాక్రమ ప్రతిభా ప్రాభవములను మొక్కవోనీయకుండ, దేశీయులలో చక్కని ప్రబోధము గలిగించుటకు సాధారణముగా నన్ని దేశములందును, అన్ని కాలములందును వీర చరిత్రగ్రంథములను వ్రాయుట ఆచారమైనది. ఇట్టి సనాతనమగు సత్సంప్రదాయమును పోనీయకుండ, కేవలము నిద్రాముద్రితావస్థలో నున్న తన సోదరాంధ్రదేశీయులను, యొక్కింత మేల్కొల్పి వారిని కార్యనిరతులనుగాను, సద్వర్తనులనుగాను దేశభక్తులనుగాను సిద్ధముచేయుటకై ప్రస్తుత మీ గ్రంథమును దృశ్యకావ్యరూపమున— అనగా నాటకరూపమున—రచించి వెలయించిన శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారి ప్రయత్న మెంతయును శ్లాఘ్యతమ మనుటకు సందియము లేదు. అందునను ప్రధానపాత్రములను సత్యవ్రతాచరణదీక్షా నిబద్ధులనుగా దిద్దితీర్చుట యనునది ఇట "బంగారమునకు తావి యబ్బినట్టు" లైనదని సంతసింపదగినవిషయము.

## "నాయకురాలు" గ్రంథప్రశంస

నాయకురాలు ( అనగా గ్రంథము ) ఆకృతిని చిన్నదయ్యును గుణమున మిన్న. నిక్కమగు దేశాభిమానము, జాత్యభిమానము, సత్యవ్రతనిరతి, యశఃకాంక్ష, సర్వసమానత్వము, విశ్వమంతయును స్వకుటుంబముగా నెన్నునట్టి హృదయౌదార్యము, అనన్యమగు భగవద్భక్తి, ఆశ్రితజనానురక్తి ఇత్యాది సుగుణముల నెన్నిటినో ఆదర్శప్రాయముగ ప్రదర్శించి మన యిప్పటి యువకులను స్వదేశ, స్వభాషాసంసేవనదీక్షాపరతంత్రులనుగా చేయుటలో సాక్షాత్తును నాయకురాలే యని ఇయ్యది చెప్పందగియున్నది.

# నాటకమునందలి ఇతివృత్తము

ఏ గ్రంథముయొక్క మంచిచెడ్డలనుగాని, గుణావగుణములను గాని చర్చించుటకుముందు దాని యానుపూర్విని మున్ముందుగా కొంత నెఱింగియుండవలసియుండుట పాఠకులకు ధర్మమై యున్నది. అందునను కాలగర్భమున లీనమై, విస్మృతప్రాయమై, కథాశేషమై యున్న చారిత్రికగ్రంథము విషయములో—తత్రాపి అట్టి ప్రాచీన చరిత్రమునుండి ఇతివృత్తలేశమును సంగ్రహించి ప్రస్తుత దేశ కాల పాత్రానుసారముగ చారిత్రికతేజము నుద్బోధించుటకై ప్రవర్తించిన యిట్టి దృశ్యకావ్యముల విషయములో, పూర్వాపరసందర్భములను గోచరింపఁజేసి, గ్రంథనిర్మాణచాతురిని, తదీయ ఘనాదర్శమును విస్పష్టముగా వెలయింపజేయుటకై అనుపూర్విని విచారణచేయవలసి యుండుట తప్పనిసరి యైనది. కాఁబట్టి రెండువాక్యములలో నీ నాయకురాలియందుగల కథాంశమును తేటపఱచి ఆ పిమ్మట శ్రీపంతులుగారు గ్రంథనిర్మాణమునందు గనఁబఱచిన నేర్పును ప్రశంసించుకొనుట మనకు అవశ్యకర్తవ్యమై యున్నది.

## పల్నాటి పూర్వచరిత్రము

ఇందలి కథాభాగము ఆంధ్రదేశములోని సుప్రసిద్ధచారిత్రిక ఖండమగు పలనాడునకు సంబంధించినదని చదువరు లెఱింగినదే. ఈ పల్నాడనునది కృష్ణానదికి దక్షిణతీరమున సముద్రమునకు దాదాపు నూటఇరువదిమైళ్లదూరములో నున్న ఆంధ్రదేశములోని యొక భాగము. ఈ భూఖండముయొక్క వైశాల్యము మించుమించు పదునొకండువందల చతురపుమైళ్లు గలదు. చారిత్రికదృష్ట్యా వీక్షించినచో ప్రస్తుతము ప్రఖ్యాతిలో నున్న మాచర్ల, గురిజాల, తుమురుకోట, కారెమపూడి మున్నగు స్థలములు ఆ పూర్వకాలమున పల్నాటిసీమలో ప్రధానపట్టణము లని మన మెఱుంగఁగలము. కేవలము ఈ పట్టములుమాత్రమేకాక ఆ కాలమున పల్నాటివీరులు త్రవ్వించిన తటాములు, కట్టించిన కోటలు, పట్టణములు, తీర్పించిన దేవాలయముల

వేయించిన దానశాసనములు మున్నగు కథాశేషములగు ప్రతిష్ఠాపనము లన్నియును ఇప్పటికిని ఈ వీరపురుషుల యొక్క విఖ్యాత మగు ప్రజాను రాగమును, పరిపాలనసౌష్ఠవమును మనకు వేయినోళ్ల జాటుచు నుద్బోధకములుగా నున్న వనుట నిస్సంశయము.

## పల్నాటి ప్రభువులు

అసలు ఈ పల్నాటిని పాలించిన ప్రభువులు (అనగా వీరజాతికి చెందినవారు) కేవలము ఆంధ్రదేశమే ఆదినుండి జన్మస్థానముగా గలిగిన ఆంధ్రవంశములకు సంబంధించినవారో, లేక ఏ యుత్తర భారతమునుండియైనను వలసవచ్చి ఆంధ్రదేశమునకు పాలకత్వమును వహించినవారో స్పష్టముగా నిర్ధారణచేయుటకు తగిన ప్రమాణ బలము మన కిప్పుడు లేకున్నను ఎన్నో తరములనుండి ఆంధ్రదేశము నందే నివసించి ఆంధ్రజాతితో, ఆంధ్రభాషతో, ఆంధ్ర సంఘముతో, ఆంధ్ర ప్రజలతో కలసిమెలసి "తాము-పరులు" అను భేదము లేకుండా (అనగా పాలకులు, పాల్యులు అనే భేదము లేకుండా) ఎంతో అన్యోన్యముగా ప్రజాపాలన మొనర్చి, దేశాభివృద్ధికి అన్నివిధముల తోడ్పడి 'తామే వారు, వారే తాము' గా పాలించి ప్రజాప్రీతిని జూఱగొనిన శుభగుణులని చెప్పుట కెట్టి సందియమును లేదు.

## వీరుల పూర్వచరిత్రము

ఇట్లు పల్నాడును పాలించిన వీరులలో (మనకు తెలిసినంత వఱకు) మొదటిపాలకుఁడు అనుగురాజు. ఈయన చందవోలు పరిపాలకుని కుమార్తె యగు మైలమ్మను వివాహమాడి పల్నాడు నరణదేశముగా గ్రహించి పాలించెను. ఈయనకు మైలమ్మమాత్రమే కాక విజ్జలదేవి, భూరమాదేవి యని మఱి యిర్వురుగూడ భార్య లుండిరఁట. ఈ భార్యలలో విజ్జలదేవియందు పెదమల్ల, పినమల్ల, బాలమల్ల దేవులును, మైలమాదేవియందు నలగామరాజును, భూరమా దేవియందు కామరాజు మున్నగు నల్గురుకుమాళ్లును పుట్టిరి. అనుగు

రాజునకు దొడ్డనాయుఁ డను నతఁడు వెలమ మంత్రిగా నుండెను. ఆయనకుమారులలోనివాఁడే మన బ్రహ్మనాయుడు. (అనగా రెండవ కొడుకు) ఈ బ్రహ్మనాయుని అన్నయగు పెద్దన్నను (బాదరాజును) అనుగురాజు తనకు సంతానము కలుగకముందు కొన్నాళ్లదనుక స్వీకారపుత్రునిగ పరిగ్రహించియుండుటచేత మన బ్రహ్మనాయునికి కేవల మనుశ్రుతముగావచ్చు మంత్రిసుతత్వముమాత్రమే కాకుండా, యువరాజత్వముకూడ కొంత ధర్మతః సంబద్ధమై వచ్చినది. కనుకనే పల్నాటినాయకుల కథాభాగములో బ్రహ్మనాయుడు ప్రతిచోటను ఎక్కుడు ప్రాముఖ్యమును ఆక్రమించుకొనుట మనకు గోచరమగుచు నుండును.

## వీరుల యుద్ధకారణము

పైని చెప్పిన వివర మంతయును బ్రహ్మనాయుని ప్రధానత్వ మును తోఁపింపచేయుటకై వ్రాసితిని. కాని ఇది మన కథాంశము గాదు. ఇక ప్రస్తుతమునకు వత్తము. అనుగురాజు పల్నాటిని పాలించి మృతినొందినతర్వాత నలగామరాజు పట్టాభిషిక్తుడైనాడు. నలగామరాజు రాజ్యపాలనము వహించిన కొన్నాళ్ళకు దొడ్డనాయ కుడు (బ్రహ్మనాయుని తండ్రి) కూడ ఆదారినే పట్టుట గలిగినది. ఇట్టి స్థితిలో నలగామరాజునొద్ద పరంపరాప్రాప్తమగు మంత్రిత్వమును దొడ్డనాయునితర్వాత బ్రహ్మనాయుడే పూనవలసియున్నను, మఱి యొకరీత్యా నాయకురాలు (ఈమెయే యీ నాటకములోని నాయకు రాలు) ఆ పదవిని ఆక్రమించుకొనుట గల్గినది. అయినను బ్రహ్మ నాయుడు మంచి మేధావియును, కార్యచతురుడును, ప్రభుభక్తిధురం ధరుడును, సత్యనిరతుడును, నిక్కమగు దేశభక్తిచే సంభరితుడును అగుటచేత నీ యకార్యమునకు కుపితుడుగాక, నలగామరాజుయొక్క తక్కిన యార్వురు సోదరులను పెద్దవారలగునంతవఱకు పెంచుచు కాలమును ప్రతీక్షించియుండి, తనకు పదచ్యుతి కల్గినను, అనాది నుండి వచ్చుచున్న ప్రభువంశమునందలి భక్తిచే అనురాగమునే ప్రదర్శించుచు, ఆ పిల్లలు పెద్దవారలైనవెనుక తాను మాచర్ల

పట్టణములో ప్రవేశించి, అచ్చట స్థిరనివాస మేర్పఱచుకొని కాలమును త్రోయసాగెను.

" బలవత్స్వామిక మవిశుద్ధాగమనం ధనం భుంజానస్య కుతో మనస్సమాధిః " (బలవంతులైన సొంతదారులు గలిగియుండి అక్రమరీత్యా చేజిక్కినదానిని అనుభవించువానికి ఎంతటి ప్రాముఖ్య ప్రాబల్యము లున్నను మనశ్శాంతి చేకూరుట ఎట్లు ?) అని భారవి మహాకవి చెప్పినట్లు నాయకురాలు (ఈమెయొక్క నిజమైన పేరు నాగమ్మ, గామాలపాడు ఈమె జన్మస్థానము. తండ్రిపేరు రామిరెడ్డి) బ్రహ్మనాయుడు తన కెప్పటికైనను కంటిలోని నలుసు లాంటివాడే అనిన్ని, ఎట్లైనను అతనిని లేకుండ చేసినచో తన

బాహటాకు అడ్డు లేదనిన్ని తలంచి తాను మంత్రిపదవికి వచ్చినది మొదలుకొని ఎటులయినను బ్రహ్మనాయుని, అతని పరివారమును తుదముట్టించవలయుననిన్ని దృఢము చేసికొన్నది. కనుకనే నలగామ రాజుపట్టాభిషేక కాలమున కానుకల నర్పింపవచ్చిన బ్రహ్మనాయునికి విషము పెట్టించినది. ఇంకను ఎన్నెన్నో మాయోపాయములు చేసినది. కాని పాండవులయెడల ధార్తరాష్ట్రు లవలంబించిన వంచనకృత్యముల వలె నవి యన్నియు నిష్ఫలములైనవి. చివఱకు కోడిపందెము లనే మిషపెట్టి బ్రహ్మనాయుని, తదనుయాయులను రప్పించి, కౌరవులవలెనే తానును వారిని ఆ మాయాద్యూతమున నోడించి, ఏడు సంవత్సరములు అజ్ఞాతవాసము చేయించినది. బ్రహ్మనాయుడు తన అనుయాయులతో ఆ కాలమున మండాదికి వలసపోయెను. నాయకురాలు అచ్చటకూడ కౌరవులవలెనే ఆటవికులను పేరేచి అతని ఆవులమందలను చంపించుట మొదలయిన ఘోరకృత్యములను చేయించి, నానా బాధలు పెట్టినది. చివఱకు ఎట్లయిననేమి అనుకొన్నట్లు ఆ యేడేండ్లు గడపిన తరువాత పాండవులవలెనే బ్రహ్మనాయుడు మొదలయినవారు గూడా తమభాగమును తమకు స్వాధీనము చేయవలసినదని అలరాజు ద్వారా రాయబారమంప, కృష్ణరాయబారమువలె ఆ ప్రయత్నము వృథ అయిపోయినందున, ఆంధ్రదేశపు కురుక్షేత్ర మనదగిన నాగులేటి

యొద్దున యుభయపక్షములవారును పోరి అనేకవేలజనులను నాశము చేసికొనిరి. చివఱకు ఆ యుద్ధమున నలగామరాజు పరాజితుడై బ్రహ్మనాయుని శరణు సొచ్చెను. మహావీరుడు, దయాళువు, ఆర్య వర్తనుడు, నిశ్చలమగు ప్రభుభక్తి దేశసేవానిరతి ప్రజానురాగాసక్తి గల బ్రహ్మనాయుడు నలగామరాజును చేపట్టి అతనికి గురిజాల సింహాసనమున తాను పట్టాభిషేకముచేసి, తానే ప్రధానియై పరిపాలనముచేసి కీర్తినొందెను.

## వీరులకథ - నాయకురాలిలో దాని కూర్పు

పల్నాటివీరులకథలో గల సారాంశ మిది. దీనిని నాటకముగా వ్రాయుటలో మన పంతులుగారు నాయకురాలిని ప్రధానపాత్రనుగా తీసికొన్నారు. తీసికొనుటయేమి ? అసలు కథలోగూడ నాయకురాలే ప్రధానురాలు. నాయకురాలివంటి తీవ్రరాజకీయపరిజ్ఞాత్రి ఈ కథలో లేనియెడల బ్రహ్మనాయుని సుగుణములు ప్రకాశదశకే వచ్చియుండెడివి కావు. అగుటకు ఆడుదియే యైనను ఈమె యుద్ధరంగమున సాక్షాన్మృత్యుదేవతయే ! రాజ్యతంత్రము నడపుటలో చాణక్యునంతటి వానికైన టాఠాలు గుణింపచేయగల కుటిలప్రజ్ఞగల కోమలి. నలగామరాజు మొదలగువారిని తోలుబొమ్మలవలె గారడీచేసి ఆడించిన సాహసురాలు. అపరభీష్ముడనందగిన బ్రహ్మనాయుని యంతవానిని గడగడ వణకించిన అంబాస్వరూపిణి. ఎత్తుకు ప్రతియెత్తు ఎత్తుటలోనేమి, వ్యూహమునకు ప్రతివ్యూహమును పన్నుటలోనేమి ఈమె కీమెయే సాటి. ముద్రారాక్షసనాటకమునందు రాక్షసమంత్రి యొక్క పన్నాగములను పాడువారించి, నందవంశమునందుగల భక్తిచే వివిధప్రయత్నములుచేసియైనను ప్రభుభక్తిని జూపగా దివిరిన రాక్షసమంత్రిని, చాణక్యుడేవిధముగా లొంగదీసి పరపక్షమునకు దాసుడై మంత్రిపదవిని వహించి, తదభివృద్ధికై పాటుపడజేసెనో, అట్లే మన నాయకురాలును బ్రహ్మనాయుని సర్వప్రయత్నములను ఉపసంహరించి, చివఱకు అతనిచేతనే నలగామరాజునకు మంత్రిత్వము చేయించిన (చేయునట్లుచేసిన) జాణ. నాయకురాలియందు ఇంతటి

ఆధిక్యము లుండుటంబట్టియే ఈ నాటకమున కీమెను ప్రధానపాత్ర ముగా పరిగణించుటయేకాక, నాటకముపేరునుగూడ "నాయకురాలు" అనియే శ్రీ పంతులుగారు పెట్టినారని తలంచుచున్నాను. (ఇది నా యూహామాత్రమే)

## ఇతివృత్తసంయోజనము

నాయకురా లను నీనాటకములోని ఇతివృత్తము నలగామరాజు పట్టాభిషిక్తుడైనతరువాత. నాయికురాలి విషప్రయోగమునకు బ్రహ్మనాయుడు తాను గురియై, అచ్చటినుండి పరుగెత్తిపోయి మాచెర్లలో నివాస మేర్పఱచుకొనినపిమ్మటినుండి ఆరంభ మగుచున్నది. కనుకనే ప్రథమాంకము ౧-వ రంగములో పాదిలె పాపన్న, కల్వగుంట కాశీపతుల సంభాషణతో వెనుకటి కథాంశములో పొటమరించిన గృహచ్ఛిద్రములును, తత్ప్రియుక్తములగు మన స్పర్థలును సూచనచేయుచు కథోపక్రమణమును ఆరంభించి, క్రమముగా కథాంశమును పెంచుచు, ప్రభువుల మనస్పర్థలవలనను, పరస్పరద్వేషములవలనను (అనగా ఇచ్చట బ్రహ్మనాయుడు, నాయకురాలు అను ఉభయుల కతులమూలమున) అకృత్రిమములగు ప్రేమలతో, అన్నదమ్ములవలె అన్యోన్యముగా నున్న ప్రజా సామాన్య మేవిధముగా సంతప్తమగుచున్నదియును ప్రదర్శించి, రెండవ రంగమున రవంత రాజకీయపరిజ్ఞానమును, కొంచెమంత ప్రభుభక్తి గల అనుయాయుల హృదయపరిస్థితులును విస్పష్టము చేయదొడగి, మూడవ రంగమున ద్విధావిభిన్నమైన పాలకజనమును ఏకోన్ముఖమునకు గొనివచ్చుటకై పరిహారము చేయవలసిన ధర్మమును నిరూపించి, ఆబాలగోపాలమును ఈ సందర్భమున నెట్టి పరిస్థితులలో తగుల్కొని పరితపించుచున్నారో విశదముచేయుచూ, చదువరులకు గామాలపాటిప్రాంతములలోని (నాయకురాలి జన్మ స్థలము) ప్రాభవసంపదలను పరిచయము గావించుచు, అయిదవ రంగము వకు త్రిప్పి నాయకురాలిపక్షపువారి ఆదర్శములను రెండవపక్షము

వారి సంభాషణలలో బీజనిక్షేపరూపముగా ప్రదర్శింపజేయుచు, కడు నేర్పుగా నాగాంబిక (నాయకురాలి) దృఢనిశ్చయమును వెల్లడించుటతో మొదటి యంకమును శ్రీ పంతులుగారు ముగించినారు.

తర్వాత రెండవ యంకమునందు తొలిరంగమున పరపక్ష నిశ్చయమును విన్నపిమ్మట బ్రహ్మనాయుని మంత్రనిశ్చయమును వెల్లడించుటకై మాచర్లసభాభవనమును ప్రదర్శించి, కేవలసాత్త్విక వృత్తియును, అవిరతమగు ప్రభుభక్తియును, ప్రజానురక్తియును గల బ్రహ్మనాయుని మంతనమునున్నూ, అందలి గాంభీర్యమున్నూ, అతని యనుచరుల ఆదర్శములను వెల్లడించుచు, నాయకురాలి రాయబారిని మధ్యను ప్రవేశపెట్టించి బ్రహ్మనాయుని పక్షమునకు కదలిక పుట్టించి తద్ద్వారా రెండవపక్షమువారి ఆదర్శములున్నూ, దృఢనిశ్చయములను వెల్లడింపజేసి తదనుగుణముగా తాత్కాలిక లోకసంస్థితిని ప్రదర్శించి రెండు మూడు రంగములను ముగించి నాల్గవ రంగమునందు కల్లబ హృదయముచే వేదనపడుచున్న బ్రహ్మనాయుని నొకమారు చూపి రెండవ యంకమును నేర్పుతో ముగించిరి.

ఇకను మూడవ అంకమునందు మరల నాయకురాలి ప్రతి వ్యూహరచనలను, రాజ్యతంత్రగమనికలను ప్రేక్షకులకు రుచి చూపుచూ బ్రహ్మనాయుడు మున్నగువారిని ప్రవాసమంపుటకు అంకురార్పణయగు (కోడిపందెమును) ద్యూతప్రయత్నమును, తదనుసారమగు నాహ్వానధోరణిని ప్రదర్శించి మొదటి రంగమును ముగించి, రెండవ రంగమున జూదమునకై ఆహూతులయిన బ్రహ్మ నాయునిపక్షమువారి మంత్రాలోచనసందర్భములకు మనలను తీసికొనిపోయి, అంతతో ఆ రంగమును ముగించి, మూడవ రంగమున ద్యూతసభాభవనమునందలి ద్యూతఖేలనవిధానమును కడునేర్పుతో చూపి, బ్రహ్మనాయునిపక్షమువారి పరాజయముతో అజ్ఞాత వాసమునకు అంకురార్పణచేయించి, సభాపర్వమును చక్కగా సంతరించి ఆ యంకమును అంతతో ముగించి, అరణ్యపర్వము నారంభించిరి.

పిమ్మట నాలవ యంకములో అజ్ఞాతవాసఖిన్నులగు బ్రహ్మనాయునిపక్షమువారి తహతహలు, తటపటాయింపులు మొదటి రంగములో పొడగట్టును. ఇట్లే రెండవ రంగములో తత్ప్రతిపక్షులగు నాయకురాలి వ్యాహారచనములును, శత్రుమారణార్థము పన్నిన కుటిలములగు పన్నుగడలును, తన్మూలమున దోలాందోళితమగు నాయకురాలి హృదయావేశములును గోచరించును. తరువాత నిందులోనే మూడవ రంగమునందు వనవాసముచే ఖిన్నులై, తత్క్లేశములమూలమున స్వబలక్షయమునకు గురియై కర్తవ్యము నాలోచించుటకై కూడిన బ్రహ్మనాయుని యాలోచనాగృహమును ప్రదర్శించి, శత్రువుల కుట్రలకు బదులుచేయుటెట్లా యని ఆందోళితములగు మనస్సులతో స్వకర్తవ్యము నన్వేషించుచున్న వీరులను ప్రత్యక్షీకరించుచు నాలవ రంగమును ముగించినారు.

అయిదవ యంకములో ఉత్తీర్ణప్రతిజ్ఞులై స్వస్థానాభిముఖులై వచ్చుచున్న బ్రహ్మనాయునిపక్షమువారిని, వారి మంతనము లను మొదటి రంగములోనున్నూ, అలిరాజు సంధిరాయబారముతో రెండవ రంగమునున్నూ ప్రదర్శించి, సంధిప్రయత్నముల వైఫల్యమును వెల్లడించి, యుద్ధమున కంకురార్పణ చేయించినారు. దీనితో అయిదవ యంకము ముగియును.

తర్వాత ఆరవ అంకము ఆరంభమగును. ఇందులో మొదటి రంగమునందు యుద్ధరంగప్రదర్శనము ఆరంభమై నాయకురాలి పక్షమువారికి మొదటి గెలుపు చేకూరుటయును, పిమ్మట రెండవ రంగమునందు స్వపక్షపరాభవమును, తోకత్రొక్కిన త్రాచులవలె విజృంభించిన బ్రహ్మనాయునిపక్షమువా రొనర్చిన పూర్ణాహుతియును, దానితో నాయకురాలి పక్షమువారు లొంగి బ్రహ్మనాయుని శరణు సొచ్చుటయును, "వీరపురుషోచితమైన రణమరణభాగ్యము తనకు గలుగదయ్యెనుగదా" యన్నవగపుతో విక్లబుడైయున్న బ్రహ్మనాయుని సమీపించి, నాయకురాలిపక్షమువారు క్షమాపణవేడి ఆశీర్వదింప గోరుటయును ప్రదర్శించి నలగామరాజును గురిజాల సింహాసన

మెక్కించుటతో ఆరవ రంగమును ముగించిరి. దీనితో నాయకురాలి నాటకమును ముగియును.

## పాత్రపోషణవిధానము

ఆంధ్రదేశమునందలి అధునికగ్రంథకర్తలలో ప్రతిభా ప్రాభవ విషయమున శ్రీ లక్ష్మీనారాయణపంతులుగారు మిన్నలు. దేశభక్తి, భాషాభిమానము, జాతీయాభిమానము అను సుగుణములు వీరికి వెన్నతోబెట్టినవి. ఆంధ్రదేశపు చారిత్రికవిజ్ఞాతలలో మా యెఱింగి నంతవట్టునకు ఇంతటి యభినివేశముతో, ఇంతటి యానుపూర్వితో ఆంధ్రదేశపు ప్రాచీనచరిత్రాంశములను చెప్పగలవారీ కాలములో నరుదుగా నున్నారు. మన మధ్యరాష్ట్రమునందు పేరెన్నికగల స్థల పురాణము లెన్ని గలవో, ప్రభువులు మొదలగు స్థానికపరిపాలకు లెవ్వరెవ్వరి ప్రభుత్వములో మన సాంఘిక సారస్వత విషయములందు ఏయే విధములగు మార్పులు, కూర్పులు జరుగుచువచ్చినవో, హృద్గత ముగా (హృదయవేదిగా) సంవత్సర మాస పక్ష తిథుల సంఖ్యలతో కూడ, నిప్పటికిని ఏకరువుపెట్టి సమన్వయముచేయగల శక్తి వారి కున్నది. శైవమతవిజృంభణానంతమునగల సాంఘిక, సారస్వత ముల స్థానికచరిత్రములను సాధారణముగా వారు కోరినంతనే చెప్పగింపగలరు. ఇది నా స్వానుభవవిషయము. ఆంధ్రలోకమునకు కానుకగా పంతులుగారు వ్రాసిన 'మాలపల్లి' యను గ్రంథమును చదువుటమూలముగా నియ్యది అనుభూతమైన విషయమై యుండుట చేత ఇక దీనినిగుఱించి విశేషించి చెప్పవలసిన పని యుండదని నా విశ్వాసము. ఆంధ్రమహాభారతమును విశేషమగు విమర్శనముతో వీరు చదివినన్నిమారులు ఇఁక నిప్పటిపండితులుగూడ నెవ్వరును చదివియుండరన్నను తప్పు కాదు. కలముపోటునందును, కత్తిపోటు నందును సమానమగు విఖ్యాతిని గడించిన తిక్కనసోమయాజియొక్క విరాటోద్యోగములు ఈయన సొమ్ము. కనుకనే చిరకాలమునుండి తాము చేసిన రాజనీతిధౌరంధర్యమును వీరు ఈ నాటకమునంద ఆదినుండి అంతమువఱకును వెల్లడించియున్నారు. నాయకురాలి

సవిమర్శగా చదువుటకు దొరకొను పాఠకవర్గము మున్ముందుగా నీ విషయమును తెలిసికొనియుండుట మిగుల ముఖ్యమని నా యభిప్రాయము.

ఇక ప్రస్తుతమునకు వచ్చుచున్నాను. శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారు నాయకురాలిని నిర్మించుటలో కౌరవ-పాండవ యుద్ధ గాథను ప్రధానాదర్శముగా గొన్నారు. కావుననే బ్రహ్మనాయుని పాత్రమును పోషించుటలో అన్నివిధముల నజాతశత్రుని పాత్రము ననుకరించి అతని సత్యవ్రతభంగభీరుత్వమును, ఆయన క్షమ ప్రధానమగు శీలమును, శాంత్యాకాంక్షను, కులాభివృద్ధిని, స్వజనానురక్తిని, స్వదేశాభిమానమును సంపూర్ణముగా నిందు పోషించుటకై తమ యావచ్ఛక్తిని వినియోగించి ధన్యులైనారు. బ్రహ్మనాయునికి ఎదిరిపాత్ర మగు నాయకురాలిని తీర్చుటలోగూడ తొలుదొల్త స్త్రీసామాన్యమునకు సహజమున్నూ, గ్రామీణస్త్రీలకు తప్పనిసరిదియును అగు ముగ్ధభావమును, కోమలహృదయతను, అమాయికత్వమును, ప్రాకృతజనవాత్సల్యమును గల నాయికగా వర్ణించినప్పటికిన్నీ, రాజ్యతృష్ణచే కఠినమైపోయి స్వీయనాశమును కూడ లక్ష్యముసేయని రారాజు హృదయకాఠిన్యమునూ, శత్రుమారణమునకై ఎట్టి యధర్మమార్గములనైనను త్రొక్కెడి సామర్థ్య బుద్ధిన్నీ, అకారణద్వేషమున్నూ కనులకు కట్టినట్లు తీర్చి అధికారాంధకార మన్న నెట్టిదియో ఆ పాత్రమున ప్రదర్శించినారు. బ్రహ్మనాయుడు-నాయకురాలు అను నీ యుభయపక్షములలో పరస్పర ద్వేషమును, అన్యోన్యసంఘర్షణమును పెంచి కథ నడుపుటకై, ఒకరికి సర్వవర్ణసమత్వమూ, రెండవవారికి కేవలము ఆర్యజనవిభక్తమగు వర్ణాశ్రమధర్మసంరక్షణమూ అనువాని నవలంబనముగా గొని, యుభయపక్షములవారు తమ తమ బలమును అభివృద్ధిచేసికొనుటలో వీనిని ప్రధానసాధనములుగా దేశకాలపరిస్థితులను గ్రహించినట్లు ఇందు నిరూపించినసందర్భము ఈకాలములోని మనకు ఒకరకపు ఛాయలను సూచించుచున్నట్టు లున్నప్పటికిన్నీ, అవి నిక్కమగు చరిత్రాంశ

ములై, చాపకూడు ఇత్యాదులగు సంకేతములద్వారా సత్యములుగా నుండుటచేత, చారిత్రికదృష్ట్యా ఈ గ్రంథకర్తకు వాటిని కూర్పక తప్పినదికాదు. ఈ నాటకమునందు బ్రహ్మనాయుని, తదనుచరులను దిద్దితీర్చుటలో వారి నోట పల్కించిన యాదర్శవాక్యములు ఇప్పుడీ ఇరువదవ శతాబ్దిలోని గాంధీమహాత్ముని యుపదేశములను ప్రతిపదమునందును స్ఫురణకు తెచ్చుచున్నవి. ఇట్టులనే, నాయకురాలి విషయములో గూడ ఆబాలగోపాలమును వర్ణాశ్రమధర్మరక్షణపరత్వము మారుమ్రోగునట్లు చేసినారు. ఈవిధముగానే ఈ నాటకమునందు ప్రధానపాత్రములను, ఉపపాత్రములను మొదలగు నన్ని యంగములను సంపూర్ణముగా తీర్చికూర్చుటలో శ్రీ పంతులుగారు కనబఱచిన ప్రజ్ఞావిశేషము ఎంతగా చెప్పినను, వ్రాసినను ఏమాత్రమూ తరగునది కాదని మనవిచేసికొనుచున్నాను.

ఇకను పాత్రపోషణవిషయమును ముగించుటకు ముందుగా నొకమాటను చెప్పవలసియున్నది. సాధారణముగా నింతవఱకును మన నాటకములలో అంకముల సంధులను అతికి కథాంశములను పొందించుటలో సంస్కృతభాషామర్యాదను విష్కంభములను వ్రాయుట మనవారి యాచారమైయున్నది. కాని యిందులో మాత్రము విష్కంభమన్న పేరుతో ప్రత్యేకముగా అంకముల సంధులను కూర్చినను, కూర్పకున్నను ప్రతాపుడను పేరుతో కాలపురుషునొకనిని ప్రవేశపెట్టుచు విష్కంభములేని కొరతను దీర్చి క్రొత్తపుంతను ద్రొక్కినారు. అయినను విష్కంభముయొక్క యాశయము లిందు గానరావు. ఏ రీ నాటకములో అంకసంధులలో ప్రతాపపాత్రమును ప్రవేశపెట్టినప్పుడెల్లను ఆ పాత్రముద్వారా అత్యుత్కృష్టములును, ప్రకృతిశాస్త్రికగమ్యములును, తీవ్రమగు మనీషతో విచారణచేసినగాని బోధపడనట్టివి అగు కొన్ని యాదర్శప్రాయములగు సిద్ధాంతములను వెల్లడించుటలో ఈ ప్రతాపుని సంభాషణవాక్యములు జీవగఱ్ఱలై వెలయుచున్నవి. అగుటకీ వాక్యములు సాధారణజనులకు అంతగా బోధపడునవి కాకపోయినా, స్థూలదృష్టులకు

షవో వేదాంతములుగా పొడగట్టినా, ఈ నాటకము యొక్క తత్త్వమంతయును వీటిపైననే ఆధారపడియున్నది. మొదటియంకము నారంభమున సృష్టిస్థితి లయముల తత్త్వమును ఉపన్యసించి, ప్రపంచము కేవలము సంకోచ వికాసములద్వారా ప్రవృత్తులను జరపుచున్నదని నిరూపించి, పల్నాటియుద్ధరంగప్రదర్శనము తటస్థించిన మూల కారణములను చక్కని మాటలతో తేటగా వెల్లడిచేయించిన పట్టులు తాత్త్వికులకు అపరిమితమగు నానందమును కూర్చునవియై యున్నవి. పిమ్మట రెండవ యంకము ఆరంభములో మఱల ప్రతాపుని ప్రవేశపెట్టి, తన ప్రధానసిద్ధాంతములగు సంకోచ వికాసములను ప్రదర్శించుట కెట్టి సాధనసామగ్రి ఆవశ్యకమైనదియును సూచింపచేసినారు. ఈ సందర్భములో వీరు వ్రాసిన 'అజ్ఞానం పశుత్వచిహ్నం' మొదలయిన వాక్యజాలము సందిగ్ధాభిప్రాయము గలవారి కన్నులకు మహోపదేశమును గావించు దివ్యాంజనపు ఘుటికలనియే చెప్పవచ్చును. తర్వాత మనకు ప్రతాపపాత్రము మూడవ అంకము నారంభమున దర్శనమిచ్చి, హింస అహింసా ధర్మముల యాథాతథ్యమును కలరూపున నెఱిగించునప్పుడు, ఏపాటి చేతనము కలవారికైనను ఒడలు జలదరింపక మానదు. దీనిలో పశుత్వచిహ్నమైన అజ్ఞానపు పూర్ణస్వరూపమును చిత్రించి మున్ముందటి యంకములలో రాగల యద్దాని విభ్రమవిలాసముల స్వరూపమును అద్భుతముగా చిత్రించినారు. ఈ సందర్భమందలి వాక్యములు లోకశాంతి నాకాంక్షించు పెద్దలందఱును ఒక్కమారైనను మననము సేయుట కర్హములని నా విజ్ఞప్తి.

ఆ తర్వాత నెప్పటియట్టులు నాలవ అంకము ఆరంభములో ప్రతాపుడు దర్శనమిచ్చును. కాని వెనుకటి ప్రతాపస్వరూపము మాత్రము కాదు. ఇచ్చటి ప్రతాపుడు అద్వితీయబ్రహ్మతేజఃప్రపూర్ణమైన, క్రౌర్యవిహీనమైన అహింసతో సహకారము నొనర్చుచు నిత్యత్వవ్రతము యొక్క విజయస్వరూపమును చిత్రించు ప్రతాపుడు మాత్రమే, మన కిచ్చట కన్పడుచున్నాడు. ఈ నాటకములో తక్కిన

భాగములందుకంటె, ఈ యొక్క యంకమును నిర్మించుటలో గ్రంథకర్తగారు అతులమగు నైపుణ్యమును, ప్రజ్ఞావిశేషమును, ప్రదర్శించి మనల సంతృప్తులఁజేసి ధన్యతను చేకూర్చుకొనుచున్నారు. తర్వాత నైదవ యంకము నారంభమున మఱల ప్రతాపపాత్ర మును ప్రవేశపెట్టి నిత్యసత్యవ్రతపూర్ణమగు అహింసారంగమున నెంతెంతటి యుత్తమపాత్రములున్నా తమ తమ పాత్రములను ప్రదర్శించుటలో ఎట్టులెట్టులు శక్తి చాలకున్నదియును సూచించుచు, అహింసాతత్వము నెఱుగనికతన కలుగబోవుచున్న సర్వనాశన మునకై ప్రజ లెట్లు పాత్రములు కాబోవుచున్నదియును వెల్లడిం చుచు నిష్క్రమించును. ఇకను మిగిలినది ఆరవ యంకము. ఈ యంకమునందు వెనుకటి యంకములలోవలె గాక ప్రతాప పాత్రము ఆద్యంతముల రెంటను ప్రవేశము గాంచుచున్నది. అందులో తొలుత బీభత్సరసపాత్రదుర్భావస్థితిని అంకాదియందును, ప్రళయగీతమును గానముచేయుటమూలమున బీభత్సరసపరిపూర్ణ స్థితిని అంకాంతముననుకీర్తింపజేసి సంకోచ వికాసముల పరిణా మములను వెల్లడించి, యంతతో ఈ పాత్రము నిష్క్రమణము జెందును. దీనితో నీ నాటకముగూడ పూర్తియగును. ఇట్టి రచనాసంవిధానము మనకు నూత్నమును, ముఖ్యముగా దృశ్యకావ్య ముల ప్రయోజనమును నిర్ణయించునదియును నయియుండి, ప్రేక్ష కుల మనస్సుల కవాఙ్మానసగోచరమగు తాత్త్వికస్థితిని గల్గించుట ద్వారా ఆనందపరాకాష్ఠను వెలయించుచున్నది. ఇంతటి మహోత్తమ మగు సన్నివేశములతో ఇతివృత్తనిర్వహణము గావించిన శ్రీ లక్ష్మీ నారాయణపంతులుగారి ప్రతిభ నాబోటివాని వర్ణనమున కతీతమైన దనుట నిక్కము.

## నాటకభాష - తదౌచిత్యము

సాధారణముగా గ్రంథకర్త లెంతటి యుత్కృష్టమగు ప్రతి భాసంపద గలవారైనను, అనురూపములగు భాషయును, భావమును అలవడినగాని రససిద్ధి నెనయజాలరు. కాని లక్ష్మీనారాయణపంతులు

గారి కీ రెండును కొట్టినపిండి. వారి రచనములో భాషాభావములు అన్యోన్యసామరస్యముతో కలసిమెలసి ముద్దులుగులుకుచుండును. గ్రాంథికభాషయందు వారికి అపారమగు నభిమానమును, ఆదరమును ఉన్ననూ ఇట్టి చారిత్రికనాటకముల యొక్క ఘనాదర్శములను వెల్లడించుటకై వారు మారుమూలభాషకై—స్వపాండిత్యప్రదర్శన గౌరవమునకై—పరుగులెత్తక, నిత్యకృత్యవ్యవహారముల నుపయోగించునట్టి, శిష్టసంవ్యవహారమున నున్నట్టి భాషనే (అనగా వాడుక భాషనే) ప్రధానముగా గొని గ్రంథములను తీర్చుచున్నారు. "కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ" అన్నట్టులు అస్మాదృశులముకూడ ఏదో కొంచె మించుమించు వ్యావహారికభాషను వాడుటకు ప్రయత్నించుచున్నవారమే యయ్యును, వారి సిద్ధహస్త సౌభాగ్యమును మేము పూర్తిగ కాంచలేకున్నాము. కాంచలేకున్నామనుటయేల ? రసవత్తరమును, అనన్యసామాన్యప్రతిభావిలసితమును నైన వారి వాడుకభాషారచనమగు నీ కృతికి యథామతి పీఠికను వ్రాయుటకు పూనుకొనినప్పుడు నామట్టునకు నాకు జంకు కలిగినది. కాని, ఆప్తులగువారి యానతియే నన్ను ఉత్సాహపరతంత్రునిగాచేసి, గ్రాంథికభాషలో నిట్లు నా లేఖినిని ప్రసరింపచేసినది. కావున నిందులకై శ్రీ పంతులుగారిని, తదితరులగు గ్రంథపాఠకులను మన్నింప వేడుచు వాఙ్మనఃకాయము లనెడి త్రికరణములద్వారా సర్వదా లోకశ్రేయమునకై తమ తనుమనోధనములను వినియోగించి, కృతార్థులగుచు సోదరాంధ్రజాతినంతను కృతార్థుల నొనరించుచు నున్న బ్రహ్మశ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి కీర్తి యాచంద్ర తారకముగా నెలకొని, భవిష్యదాంధ్రయువకులకు సద్వివిధముల నాదర్శమై వెలయునట్లు చేయుమని అకారణదయాళువును, సర్వలోక నియంతయును నైన యా యాదీశ్వరుని నిరంతరము వేడుకొనుచు నింతతో నా యీ లేఖినిని విషయాంతరమున నేమించెదను.

క్రోధన-ఫాల్గుణ పూర్ణిమ
చెన్నపురి

ఇట్లు విధేయుడు
**పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి**

# నాయకురాలు

## ౧-వ అంకము

[ ప్రవేశము - ప్రతాపుడు ]

ప్రతాపుడు : నా పేరు ప్రతాపుడు. సౌందర్యవల్లి నా తోబుట్టువు. మాది మొదట శక్తిరూపం.

ప్రపంచములో సృష్టి స్థితి లయాలని మూడున్నవంటారు గాని, జరగుతున్నవి రెండే కార్యాలు. అవి సంకోచ వికాసాలు. స్థితిలో మొదటి భాగం వృద్ధి ; రెండవది క్షీణత. వృద్ధి సృష్టి కార్యములోని భాగమే. క్షీణదశ లయములో జేరుతుంది. కనుక ప్రపంచములో సంకోచ వికాసాలు రెండే వున్నవి. అనగా సృష్టి, లయము అనే రెండుపనులే జరుగుతున్నవి.

సౌందర్యవల్లి సృష్టిని జేస్తుంది, నావల్ల లయం జరుగుతుంది. సౌందర్యవల్లి స్వరూపం శృంగారం, నా స్వరూపం రౌద్రం. సృష్టిజేయడం నా సోదరికి నిత్యలీల, లయింపజేయడం నాకు నిత్యలీల. మొదటినుంచీ నాకిదే పని. ఏదో నెపం బెట్టి నాపని నే జరిగించుకుంటుంటా.

నా నాటకానికి అంతులేదు. ఇదివరకెన్నో రంగా లయినవి. ఇంకా యెన్నో కావలసివున్నవి. పల్నాటిరంగం ఒకటి చూపించవలెనని వచ్చా. ఆః విన్నారా ? ముందుగా దేవరహాస్యం ఒకటి చెపుతా. పూర్వం విష్ణూ, శక్తీ - ఇద్దరూ

తగవులాడారు. ఆ పగ తీర్చుకోవడానికి విష్ణువాంశలో బ్రహ్మనాయుడు, శక్తిహాంశలో నాగమ్మ జన్మించారు. ఆ రెండు పాత్రలను బెట్టి నే నాటకం నడిపిస్తా. మీరు నాటకం చూస్తూవుండండి. నే మళ్లీవచ్చి నా లీలలు యింకా మనవిచేస్తా.

( నిష్క్రమణము )

## ౧-వ రంగము

### గురిజాల - కోట పహరా

[ ప్రవేశము - పొదిలె పాపన్న ]

పాపన్న : అబ్బా! చలికి వేళ్లు కొంగర్లుబోతున్నవి. ఎన్ని సార్లు పచారుజేసినా ఒంటికి వేడెక్కందే! కాస్త దమ్ము పీల్చింది లాభంలేదు.

[ చుట్టతాగుతూ ] ఎవ రా వచ్చేది? పగవాండ్లా, స్నేహితులా?

[ కల్వగుంట కాశీపతి ప్రవేశము ]

కాశీపతి : నేనే.

పాపన్న : నేనే అంటే?

కా : ఎవరనైనా అనుకో.

పా : కాశీపతీ, శత్రుడవా, మిత్రుడవా?

కా : ఎవరయిందీ యెట్లా జెప్పను, నీ సంగతి తేలందే?

పా : తేలే దేమున్నది, పొట్టే తేలుస్తుంది.

కా : సామాన్యంగా అంతే అనుకో, మనబోటివాండ్లదే కష్టం

పా : పిల్లలను చూడడానికయినా తేపా మాచర్లకు పోక తప్పదు. రెండు రాజ్యాలకూ విరోధాలు బలమయినవా అంటే, మధ్య సన్నవాండ్లం నలుగుతాం.

కా : చంద్రవంక యిక మనది కాదనుకోమా లేక నాగుతేరు పగవాండ్లదని విడిచిపోదామా ?

పా : ఈ పంపిళ్లేమిటి ? పల్నాడంతా ఒకటే గడ్డ.

కా : ఇదివరకు మనది పోతుగడ్డనిపించుకున్నది. చుట్టుపట్ల రాజ్యాలలో మన మన్నమాటల్లా చెల్లింది. ఇతరులు మనవంక తేరిచూడలేకపోయినారు.

పా : ఇవ్వాళ పల్నాడు రెండు చీలికెలు చేశారు. రేపు నాలుగు చేసుకుంటారు. వాండ్ల దేమిపోయింది ? వాండ్ల పుసులు వాండ్లు జూచుకున్నారు. మన కష్టాలు దెలిసిన వాడు బ్రహ్మనాయుడైనా చెప్పకూడదూ ?

కా : నీదంతా తెలియనిసోది. పంపిణీకి మూలకందం బ్రహ్మ నాయుడే అయితే, ఆయనను వద్దనమంటావేమి ?

ఇవ్వాళ రెండు చీలికెలు చేశారు. రేపు నలుగురు పంచుకుంటారు. అప్పుడు నలుగురివి నాలుగుదారు లవుతవి. ఎదుటివాడికి పలచదనంగాదూ ?

పా : పోయింది. పల్నాటిపేరు పోయింది. ఇక పల్నాటి పేరు మాసిపోయి చీలిక కొక కొత్తపేరు పుడుతుంది.

కా : ఎక్కడబోయింది ? పెద్దవాండ్లలోకూడ కదలిక బుట్టింది. సన్నగా రాజుతున్నది. కేతురెడ్డి మొన్న నాతో హెచ్చరించాడు. తరువాత యేమయిందో తెలియలా ?

పా : ఆయన యీ పహారాలోనే తనిఖీకి వస్తాడు. వేళ యింది, పహారా మార్చుకొన్నట్టు దస్కతు బెట్టు.

కా : ఉ(-దూరంగా అలికి డవుతున్నది.

పా : వస్తున్నట్టున్నాడు. పారా వెయ్యి.

కా : (తిరుగుతూ) ఎవరువారు? జవాబు చెప్పి కదులు. మిత్రుడవా, శత్రువువా ?

కే : మిత్రుణ్ణే ; కేతురెడ్డిని. అంతా క్షేమమా ?

కా : అంతా క్షేమమే.

కే : అత డెవరు? మాచర్లమనిషిలాగున్నా డే ?

కా : పొదెలె పాపన్న ; ఇప్పుడే పారా వదిలాడు.

కే : ఆహా! కోటముఖస్థలాన యిద్దరు పగవాండ్లా కావలి గాయడం ?

పా : పగవాండ్లమే. ఇక మాకు గంగధారిమడుగు, పాముల మడుగు, పిల్లేటినీళ్లు విషాలు ; గురిజాల పరదేశం.

కా : పెద్ద లేమైనా మార్గం యోచించారా ?

కే : ఒక టేమార్గం ; పరాయిల చేజిక్కింది, వూరికే వస్తుందా ?

పా : రాదులే. యేమయినా తేలిందా ?

కే : నరసింగరాజుగారు చాలా పట్టుదలగా వున్నారు. నాగమ్మగారు పొద్దున కాశీనుంచి తిరిగివచ్చారట. వెళ్లి మాట్లాడుదా మనుకొంటున్నాము. మీ సలహా ఏమని ?

పా : ఇందరి మాటలూ, సలహాలూ వద్దు. నిర్ధారణ చెయ్యండి. మేము దేనికయినా సిద్ధమే. ఆలస్యం చేయవద్దు. పని వేడిలో జరగాలె.

౨-వ రంగము

నరసింగరాజు గృహము

[నరసింగరాజు, కేతురెడ్డి ప్రవేశము]

నరసింగరాజు: మాచర్ల మండలములో అభిప్రాయం యెటు మొగ్గుగా వుందో విచారించారా?

కేతురెడ్డి: ఇప్పుడు ముల్లు మనవైపుకే వున్నా లోకములో రాముడికీ రావణుడికీకూడా స్వస్తిజెప్పి కాలం గడుపుకొనేవాండ్లు చాలామంది వుంటారు. కాలు కుదిరిన తరువాత వారి పలుకుబడి యెక్కువకూడా కావచ్చు.

న: ఏ యెండ కా గొడుగు బట్టేవాండ్లు యెవరికీ ప్రతికూలించరు. ఎదుటవున్నవాడే పెండ్లికొడుకు. మనము మాచర్ల మనదనే అంటూ వుంటే సందేహించి చాలాభాగం యెటూ చేరకుండా వుంటారు.

కే: అక్కడ ప్రొద్దున లేస్తే పొలిమేరదాటి రాంది గడపనివాండ్లు చాలామంది వుంటారు. వంపినే యెవరికీ యిష్టముండదు.

న: జోస్యం జెప్పు, నాగమ్మగారి అభిప్రాయం యెటు బోతుందో?

కే: అభిప్రాయాలతో లాభంలేదు. కార్యభారం వహిస్తుందా, లేదా అని ప్రశ్న.

న: వారితో మాట్లాడడానికి మంచిసమయ మేదో విచారించారా?

కే: రెండు జాములకు శివపూజట. అటుతరువాత మంచి సమయమని తెలుస్తుంది.

న: అభిజితులగ్నం బెట్టారే. చీకటితో ప్రయాణంగట్టితేనేగాని అందుకోలేము.

కే: ఏమన్నారు రాజుగారు?

న: మీతో జెప్పినవే నాకూ జెప్పారు. భాగము బుద్ధి పూర్వకంగా యివ్వలేదనీ, బెదిరించి బ్రహ్మనాయుడు మోసకృత్యంగా తీసుకొన్నాడనీ, తిరిగి పొందడం న్యాయమనీ, మూడే ముక్కలు.

కే: ఈ మాటలవల్ల ప్రయోజనం లేదు. తనకు రాజ్యం రావడం న్యాయమంటే యిచ్చిపోయేవాం డ్లెవరూ వుండరు. యుద్ధం జేయకుండా రాజ్యాలు రావు. దానికి తయారవుతారేమో గట్టిమాట కనుక్కోండి. తీరా మనమంతా సిద్ధంజేసుకొన్నతరువాత ఆయన తమ్ముడని కర్షిస్తే ఆభాసపనవుతుంది.

న: మగ్గలోకి దిగితే వెనుకకుదీసేవారు గారు. జయము కలుగుతుందనిమాత్రం నచ్చజెప్పేవాండ్లు గావాలె. బ్రహ్మనాయుడు పూర్తిగా పిరికిమందు బోశాడు. యుద్ధమంటే ముందంజవేసేవాడు మంత్రి దొరకాలె.

కే: బ్రహ్మనాయుడినే మంత్రిగా వుండమని తిరిగి కోరుతున్నారటగా?

న: ఎవరు గోరారు? ఇది రాజుగారికి దోచిన సలహా కాదు. అలరాజు కదుటా దిండునా బడకుండా వున్నాడు. తండ్రిని యిటు దీసుకరాలేదు. తాను మామను విడిచి పోలేదు. మామకు మగపిల్లలు లేకపోవడంచేత యేకాలానికయినా రాజ్యం తనకు వస్తుందనే ఆశ బాగావున్నది. అటుబోతే యీ అవకాశం బోతుందని భయం. ఎటూ పాలుపోక రాజీపెటకం బెడుతున్నాడు. చివఱకు అనుకొన్నంత అయింది. బ్రహ్మనాయుడు యువరాజుకు తాను రాజ

గురువుననీ, పాలనకర్తననీ నిన్న మాచర్లలో ప్రకటించు కొన్నాడు. ఇప్పుడు మాచర్లకు నిజమయిన ప్రభువే నాయుడన్నమాట. రాత్రి రాజుగారికి వచ్చిన జవాబులో మన రాజుగారు భయపడవలసిన అవసరము లేదనీ, తాను మాచర్లలోనే వుండి గురిజాలకు పరరాజభయం లేకుండా కాపాడుతాననీ వ్రాసి వున్నది. అంటే, నలగామరాజు వారికి సామంతరాజన్నమాట.

కే: దానినిబట్టి రాజుగారి కంత అర్థం ద్యోతకమయిందా?

న: దాంట్లో దాపటిక మేమున్నది? స్పష్టంగానే కనబడ్డది. ఇక బ్రహ్మనాయుడు మంత్రిపదవి స్వీకరించడని నిశ్చయించు కొన్నాడు.

కే: మన రాజుగారు సామంతపదవికి అంగీకరిస్తారా?

న: అంగీకరిస్తాడు. బుద్ధిపూర్వకంగా అంగీకరించకపోయినా బ్రహ్మనాయుడు బలవంతంగానయినా వొప్పిస్తాడనికూడా అన్నాను. ఉత్తరం కండ్లు తెరిపించింది. ఇప్పుడు తహాతహా పడుతున్నాడు.

కే: రాజుగారికి నిజస్థితి తెలియడం మంచిదయింది. నాయుడు వేసిన అంజనం యిప్పటికి దిగింది. మన మార్గం మనం యోచించవచ్చు.

న: మనం ముందుబోయి నాగమ్మగారికి విషయం తెలిపి వుంచితే తాను వేటనెపంమీద గామాలపాటిప్రాంతాలకు వస్తామన్నారు. ఉభయులకు అక్కడ సమావేశం గలిగించాలె.

కే: సరే, చీకటితో బయలుదేరుదాం.

( తెర పడుతుంది. )

## ౩-వ రంగము

### గామాలపాటి పరిసరాలు

[ నరసింగరాజు, కేతురెడ్డి ప్రవేశము ]

నర : రాస్తా చాలా చుట్టు ; అడివిదారి అందిపుచ్చుకున్నట్టుగా వున్నది.

కే : రహితువత్తిడి బాగా వున్నట్టున్నది. భూమి బాగా తెగుబాటయింది.

న : మేత పుష్కలంగా వున్నది. పశువులు జూడు, నున్నగా యీగవాలితే జారిపోయేటట్టుగా వున్నవి. ఆహా ! పిల్లవాడెంత శ్రావ్యంగా పాడుతున్నాడు !

కే : గొంతుకేమి, పాట గమనించండి.

పాట

మోహన - ఖండగతి - ఏక

కాపు బాలిక

కోపానబోయేటి - కోరబొల్లావా
పరుగుపరుగునబోయె - పాలబొల్లావా
మేతదావిణిబడ్డ - మేలంపుటావా
మాచర్ల అడవులు - మనవిగావోయి
పురపుచొప్పున బోయి - మాటదెచ్చేరు.

కే : మన రాజకీయవ్యవహారాలు సామాన్యజనులనుగూడ కలవరపెడుతున్నవిసుమా !

( ఆవులు చెప్పినట్టు మఱివొక బాలిక )

పాలాకుపచ్చలా - పరువంపుపడుచా
అద్దాలరవికలా - ముద్దులాపడుచా
తంగేటిపూవుల - ధరియించుపడుచా

మాచెర్ల అడవులూ - మనవిగా కేమి ?
మలిదేవుడడ్డితే - మరలివచ్చేమా !

న : పల్నాటబుట్టిన పశువులకుకూడా పౌరుష మేగదా.

[ కాపు బాలకుడు ]

కోరకొమ్ములతోటి - కొమరొప్పుబసవా
పులిమచ్చవన్నెతో - పాలుపొందుబసవా
నీటిదావిణిబడ్డ - నీలంపుబసవా

చంద్రవంకానీళ్ల - చాయ బోకోయి
మాచర్ల మడుగులు - మరచిపోవోయి.

కే : మాచర్ల తనకు దూరమయిందని బాలు డెంతవిచారపడుతున్నాడు! ప్రజలభావాలు పరికించి పాలించగలవాడే ప్రభువు.

న : ఇక్కడి ఆచారాలు మా కేమితెలుస్తవి ? మీబోటివాండ్లు తెలియజెవ్వాలె.

[ బసవడు చెప్పినట్టు మఱివొక బాలుడు ]

చిరికోలబట్టిన - చిన్నిబాలూడా
చద్దిమూటలనొప్పు - ముద్దుబాలూడా
పిల్లనక్రోవూదు - పిన్నబాలూడా

మాచర్లఅడవులు - మనవిగా కేమి ?
బ్రహ్మన్నఅడ్డితే - పారివచ్చేమా !

న: శబాష్ బసవా, నాయకురాలి స్వగ్రామమయిన గామాల పాటి పేరు నిలిపావు.

కే: ఈపాట వింటే రాజువొంట జితించిన పిరికిమందు విరిగిపోను.

న: గామాలపాడు పెద్దవూరే సుమా !

కే: వూరికేమి, ఆ రోటిపాట వినండి.

న: ఇక రోటిదగ్గర పాటలు వినవలసిందే. రాజ్యం పోగొట్టుకొని చేసే పనే అది.

కే: అయ్యా, రోటిపాటలే మేటివీరులను తయారుజేసేది. ఇందాకటి నుడుగే మళ్లీ అంటున్నది వినండి.

పాట

మధ్యమావతి - త్రిశ్రగతి - ఏక

సాధనచతుష్టయపు - సంపత్తిగన్న
అతడెపో సద్గురుడు - అతడె పరశివుడు.

న: గామాలపాడంతా శివమయం జేసిందే నాగమ్మగారు !

కే: మనమోస్తరుగాదు, ఆమె వొక పనికి పూనుకుంటే పూర్తెయ్యేవరకు నిద్దురపోనిస్తుందా?

వర్ణాశ్రమాచార - ఁావిదప్పితే
తారుమారై పోను - ధర్మములన్ని

కే: ఈ పాట బ్రహ్మనాయుడికి తలనొప్పి పుట్టించక మానదు. నాగమ్మ కేవల శిష్టాచారసంపన్నురాలు.

పల్నాటిరాజులు - పాడిదప్పేరు
మాచర్లదప్పేను - మారాజుకపుడె

న: మన రాజకీయవ్యవహారములలోకి పూర్తిగా దిగింది.

కదుల్లె కత్తులు - వెదుల్లె గదలు
రండెమ్మ మీరంత - దండుబోదాము

కే: రాజా, గ్రామాలపాటి వీరవనితలె మార్గం జూపిస్తున్నారు. ఈ వీరమాతయొక్క పదమునే మనము ఉపశ్రుతిగా తీసికొనవచ్చును.

న: ఉపశ్రుతిమాత్రమేగాదు. బ స్త్రీలు నిద్దురబోతుంటే పల్లెటూళ్లుడికిపోతున్నవని యీ పాట ఋజువు జేస్తున్నది.

[ ఒక ముసలివాడు ప్రవేశము ]

కే: అయ్యా! నాగమ్మగారిల్లెక్కడ?

ము: ఇదే.

న: వా రేమి జేస్తున్నారు? నిద్దురలేచారా?

ము: అయ్యా! మీదు పరదేసులా? పల్నాట పగటినిద్దుర లేదే?

కే: వారు కొద్దికాలము క్రిందటనే యీ దేశము వచ్చారు. దేశాచార మాళ్లీతు తెలియదు.

ము: రాజులా? రాజబంధువులా? అంతకంటె పరాయి లెవరున్నారు, ఈ దేశములో?

కే: మా సంగ తెందుకులెండి! అమ్మగా రింట్లో వున్నారా?

ము: మా సంగతి మీకూ వద్దు.

కే: అయ్యా! తమపేరు?

ము: అదిమటుకెందుకు? పరాయిగా వచ్చినవారు మీ సం
చెప్పకపోతే నే నంతవెఱ్ఱివాడిననుకున్నావా, మా సం
జెప్పడానికి?

కే: అయ్యా! నే ఈదేశపువాడినే, రెడ్లము.

ము: అది కనుపడుతూనే వున్నది.

కే: వారు మన రాజుగారి సోదరులు.

ము: అయ్యా! తమరేనా పగటినిద్దురబోతూ పల్నాడు పంచి పెట్టింది?

కే: మేలుకుండి పంచిపెట్టగూడదా?

ము: అది నిద్దురమత్తులపనే, సరే, నాపేరు రామిరెడ్డంటారు.

కే: నాగమ్మగారు తమపుత్రికేనా?

రా: మరె - మాపిల్లే - లోపలికి దయచెయ్యండి. మెల్లాలో కూర్చున్నది. [ తెరలోనికి పోతారు ]

[ నాగమ్మ ప్రవేశము ]

నాగ: [ ప్రత్యుద్ధానం చేస్తూ ] అయ్యా! కేతురెడ్డిగారా, గురిజాలకోటకు అధ్యక్షులే! దయచెయ్యండి. ఓహో! నరస ప్రభువుగారా; ఏమిసుదినం! సాక్షాత్తు దొరలే యీ కుటీర ములో అడుగుబెట్టారు! బీదల కుటీరములుకూడ చూస్తుం టేనేగాని రాజభవనముల వైభవాతిశయం తెలియదు.

న: కాదు, మా నిద్దురమత్తు వదలదనండి.

నా: సరె, మా అయ్యగారితో తమకు సంభాషణ జరిగినట్లు న్నది. వారి కవి మామూలుమాటలే; రాజులు సోమరులూ, నిద్రమత్తులూ అని వారి అభిప్రాయం.

న: అది నిశ్చయంగూడాను.

నా: కాని తమబోటివారిని మినహాయించక తప్పదు. పాద ప్రక్షాళనంజేసి యిటు తివాసిమీదికి దయచేయండి.

[ అందరూ కూర్చుంటారు ]

నా : ప్రభువుగారికి క్షేమమేగద ?

కే : క్షేమమే ; తమకు తెలియని సంగతు లేమున్నవి ? తమరు దేశంలో లేనిలోపముమాత్రం జరిగింది.

నా : కేతురెడ్డిగారు కోటను పాలిస్తుండగనే పల్నాటికేతువు పడిపోయిందే ?

కే : నాగమ్మగారు భూభారము వహింపని లోపమే నని మనవి జేశాను.

నా : పల్నాటిభారమును వహిస్తున్న పున్నాగముల కది అగౌరవమని నా మనవి.

కే: పున్నాగముల అగౌరవము స్త్రీనాగములు తొలంగించాలె.

నా : బ్రహ్మనాయుడుగారు మంత్రిపద వేల మానుకున్నారో చెప్పగలరా ?

న : మాచర్లలో రాజగురువులై పూజలు గొంటున్నారు. ఐహికపదవులయందు వారికి ఆస్థ తగ్గినట్టున్నది.

నా : లోకములో బ్రహ్మ పూజలుగొనడం యిప్పటికి వింటున్నాము. ఐహికపదవులయందు ఈ బ్రహ్మకు ఆశ తగ్గిందనుకోను. నిజానికి పబ్రహ్మకూ తగ్గలేదు. ప్రస్తుతము యువరాజుకు రాజప్రతినిధిగా వున్నా, త్వరలో మాచర్లకు రాజుగూడా అవుతాడు. ఇది నాగమ్మ జోస్యం.

కే : రాజుగావలెనని కోరికెమాత్రమున్నదనండి.

న : బుద్ధి భూమి తేలవలెననే వుంటుంది. అది నెరవేరవద్దా ?

నా : అది వేరు. ఇప్పుడు జరిగినపనికంటె సులభసాధ్యమే.

న : వారసుడుకూడా కాడే.

నా : కత్తి అన్నిహక్కులు కలుగజేస్తుంది.

న : మల్లిదేవునియందు బ్రహ్మనాయుడి కత్యంతమయిన ప్రేమ.

నా : అవును, తోడేలుకు మేకపోతుమీదా అటువంటిప్రేమే వుంటుంది.

కే : నాయుడు అట్టి క్రూరకృత్యాలకు లోబడడని నా మనవి.

నా : ఆయన పూర్వచరిత్ర మీకు దెలియదు. ఒక చిన్న దృష్టాంతం జెపుతాను. ఈ మధ్యనే లేక లేక పుట్టిన కొడుకును యెవడో తండ్రిగండ మున్నదని చెప్పితే నరక డానికి అడవికి బంపించాడు. అన్నగారు దయదలచి పిల్ల వాడిని దాచిపెడితే ఆయనమీద కక్షసాధిస్తున్నాడు. ఆయన స్వార్థపరత్వానికీ, క్రౌర్యానికీ యింతకంటె యేమి దృష్టాంతము కావాలె ?

న : శివ, శివ ! పాపము శమించుగాక.

నా : పాపము దానెంతటది శమించదు. గట్టి ప్రయత్నం జెయ్యాలె.

కే : అంతవరకు నిశ్చయమే.

నా : మరి మీరంతా యేమి యోచించారు ?

న : మనది మంత్రిలేని రాజ్యం. ఆ పదవి తమరు స్వీకరించాలె.

నా : నాకే మంత్రిపదవి !

న : తమరు స్వీకరించక తప్పదు. తమరు చుక్కానిదగ్గర నిలవంది పడవ గట్టు జేరదు. ఇది రాజుగారి నిశ్చితాభి ప్రాయంకూడాను.

నా : ఏమో ! ఇది నావల్ల కాదగినపని గాదు.

కే : మీరు కారణజన్ములు. ఈ పని మరివొకరివల్ల గాదు.

న : ఈ సంగతి మాట్లాడడానికే రేపు రాజుగారిటు వేటకు వస్తారు. ముందుగా విన్నవించడానికి మమ్మును బంపారు.

నా : అయ్యా ! వింటున్నావుగద, సంగతులన్నీ ! ఏమంటావు ?

రా : నీవు మంత్రైనంతమాత్రంచేత లాభంలేదు. వారంతా అక్షరాలా నీవు చెప్పినట్టు నడవడానికి వొప్పుకుంటే అంగీకరించవచ్చు. రాజుగారికి యీ షరతులు వైనంగా జెప్పు. వొప్పుకుంటేనే ఆయెను.

నా : ఇంతపని నావల్ల అవుతుందా ?

రా : అయితే నీవల్లనే కావాలె. మాచర్ల మనదయ్యేవరకు ఎత్తినకత్తి దించనని దీక్షబెట్టుకో. అది నెరవేరిన వుత్తర క్షణం వైదొలగి నీ పొలమూ, పశువులూ చూచుకో.

నా : నాకు పశువులసేవ పశుపతిసేవకంటేగూడ ప్రియతరము. రాజ్యభారనిర్వహణ మతిదుష్కరం.

రా : ఎల్లకాలం నిన్ని భారం మోయమనడంలేదుగా. సమయం గాని సమయాలు వచ్చినప్పుడు మామూలు ప్రకారం పోదామంటే వీలుగాదు.

నా : రాజుగారు ఈ షరతుల కంగీకరిస్తారా ?

న : మే మడిగిన వొక్కషరతు తమరు అంగీకరిస్తే తక్కిన షరతు లెన్నైనా వా రంగీకరిస్తారు.

నా : సరే. అన్నీ వారి సమక్షములోనే మాట్లాడుదాం. రేపేవేళకు వస్తారు ?

కే : ఇదేవేళకు వస్తారు.

నా : చిత్తం. అకాలమయింది. శివపూజకు లేవండి.

[నిష్క్రమణం, తెరబడుతుంది.]

## ౭-వ రంగము

### గామాలపాడు ఆవులమంద

[ నాగమ్మ, రామిరెడ్డి, పశువులు ప్రవేశము ]

నా : అయ్యా, నేను ఎటువంటిదాన్నో నీ కొకబిడ్డనున్నాను. నాకు గొడ్లే బిడ్డలుగదా !

రా : గొడ్డూ-బిడ్డా అని గొడ్డునే ముందు జెప్పారమ్మా.

నా : ఎవరో నాబోటిమ్మే చెప్పివుంటుంది. ప్రేమతో బెంచు కొన్న ఈ మందా, పంటకువచ్చిన ఈ పొలాలూ విడిచి గురిజాల బోవడమంటే నా కేమీ మనసొప్పడములేదు.

రా : నాలుగురోజులు అలవాటుపడ్డదాకా ఏదో క్రొత్తగా వుంటుంది. పట్టవాసం అలవాటుపడ్డవాండ్లకు పల్లెలలో వుండడమూ కష్టమే.

నా : నేను బస్తీలకూ, రాచనగళ్లకూ కొత్తదాన్ని గాక పోయినా పల్లెలకే అలవాటుపడ్డాను. కాని నక్కెక్కడ నాకలోకమెక్కడ !

రా : పట్టవాసమంటే నాకూ తలనొప్పే.

నా : మిరపతోట పూతా పిందే విదులుతున్నది. రాత్రి దోలిన పయరగాలికి రెమ్మలు చిత్తవత్తుగా బుట్టి, నలు దిక్కులా సాగుతున్నవి. కాపుకు వచ్చేలోగా తప్పక సీకాయకుండ పెట్టించు.

రా : అదెంతలోపని !

నా : వరిగచేను విశేషంగా పెరగకపోయినా కాడకంటు యెన్ను పొడుగై ధాన్యలక్ష్మి తాండవమాడుతున్నది.

చూడీ వరిగెదుబ్బు. యెన్ను బరువై కదలలేని నిండు చూలాలివలె పిల్లగాలికి బందికాడుతున్నది.

రా: సమయానికి దీనికి నీ సహాయ ముండదుగదా ? యే కోత కత్తె దాని జన్మము సార్థకము చేయవలసివున్నదో ?

నా: గోలలైన యీ గోవులను విడిచి కపటములకూ, కుట్రలకూ, మోసములకూ ఉనికిపట్టైన రాచకార్యములలో ప్రవేశిస్తున్నాను. ఈ అడుసులో దిగబడి నా యెద కూరుకొనిపోతుందో, కుమ్మరిపురుగువలె సంచరిస్తుందో చెప్పలేను.

రా: అంటించుకోంటే అంటుతుంది. "నా" అనే అక్షరం తీసివేయి, ఏదీ అంటదు—అదిగో కపిల ! నీవు దూరము వెళ్లబోతున్నావని సడిగన్నట్టున్నది. ఓసి దాని కడుపుడక-ఎట్లా అలుముకుంటున్నదో చూడు.

నా: (వీపు నిమిరి) దీనికి మలుగులు కుంగినవి. ఎక్కువ రోజులు పట్టదు. ఈనంగనే నాకు వుత్తరం వ్రాయి. ఎల్లావు నే లేకపోతే దిగులుపడుతుందిగాఁవాఁలె.

రా: అది నిన్ను ముట్టెతో రమ్మని పిలుస్తున్నది. దగ్గరకు పద—ఏమి చేస్తుందో.

నా: (కొమ్ముపట్టుకొని వూపి) నే పోయివచ్చేదా ? ఎందుకు ముట్టె నా వొళ్ళో పెడతావు ? నీకేమైన తాయం తెచ్చాననుకొన్నావా ?

రా: బుడిగిది పుట్టినప్పటినుంచి నీకు మాలిమి. నీవు లేకపోతే పాలీయదు.

నా : నేను రెండుచేతులతో ఏకధారగా పాలు తీస్తుంటే అది కండ్లు మూసుకొని వొళ్ళు మరిచి మహదానందంతో కాలు కదపకుండా వూగుతూ నిలువబడేది. నేనూ వొళ్ళు మరిచే దాన్ని. ఇక కొన్నాళ్ళదాకా నాకీ ఆనందం లభించదు కదా!

రా : దీని యెడదూడను యెట్లా మరచివుంటావే? నీ కది మనుమరాలుగదా.

నా : ఇశ్శో - అబ్బా - నే నేమి జేసేదే; అయ్యో, చూడు. దానికి బాగా వయస్సు మొటమరిస్తున్నది. దాని కాటిక కండ్లకు తోడుగా సిగమోరతాడు వేయిస్తే కళకళ్లాడుతూ పెండ్లికూతురువలె వుంటుంది. (ముద్దుపెట్టుకొని) ఇగ పో, అయ్యో! పులి కాటువేసి తల్లిబోయిన యీ చిన్ని పెయ్యను నే విడిచిపోలేను. నా వెంటనే తీసుకుపోతా. పోతపాలచేత గాబోలు, దీనికి పొట్ట పెరిగింది.

రా : తీసుకపోనవసరము లేదమ్మా, నీ మారుగా నే చూచు కుంటాగా.

నా : దానికి కొమ్ములు రాకపోయినా, రేపు సంక్రాంతికి కొమ్ములు మొల్చేచోట సున్నము, ఎఱ్ఱమన్ను చుక్కలు రాయించు.

రా : అట్లాగేలే. మళ్లీ ప్రయాణానికి యెండపడుతుంది, పద.

నా : నేను గురిజాలపోయినా ఆ కోడెదూడ మువ్వలపట్టెడ రవళి, చిరుగంటల చప్పుడు పొద్దుగూకులు చెవులో మోగు తునే వుంటవి. ఆ కాలి వెండ్రుకలతాడు అందానికి అందె వేసుకొన్నట్టుగా వుంది. బసవడూ! ఇటు రారా, చూడు—

వాడి కొంటెతనము. చిక్కకుండ పరుగెత్తాడు. సరె— తలచుకొన్నకొద్దీ విచారంతప్ప ఎంతసేపున్నా పోక తప్పదుకదా? ఇక నీవు ఇంటికి పో. రాజుగారు వచ్చేవేళవు తున్నది. పోయి కలుసుకొంటా.

రా : అమ్మా! మూడుకాళ్ల ముసలిని. నన్నేమి జేసిపోతావే? ఊరక పండ్లబిగువున మాట్లాడుతున్నాగాని, కాళ్లు నిలవ బడడములేదు. నీవు లేకపోతే ఇల్లు గబ్బగిమవుతుంది.

( అని కూలబడుతాడు. )

నా : ( మీద చేయివేసి ) ఏమే అయ్యా! ఎట్లావున్నది? నీవు ధైర్యము విడిస్తే నాకు కాలుసాగదు. ఒకవేళ బలవంతంగా పోయినా నా మనస్సు నీమీదనే వుంటుంది. పోనీ రా వీలులేదని రాజుగారితో చెప్పివేస్తాను. నీకు కష్టమైనపని నాకెందుకు? పోనీ నీవుకూడా రా.

రా : (చివ్వున లేచి) నీవు మహత్కార్యం చేయబోతుంటే ఈ ముదుసలి అడ్డమురావడంకూడానా? తక్షణం లేచి పద. నే నింట్లోవుండి ఈ కామాటమంతా చూచుకొంటా. వెను కాలోచనవద్దు. ( అని వెళ్లినాడు )

[ తెరపడుతుంది. ]

## ౫-వ రంగము

[ వనము : నలగామరాజు, కేతురెడ్డి, నరసింగరాజు ప్రవేశింతురు. ]

నల : కేతురెడ్డీ, చేతిమీదుగా పోగొట్టుకొన్నా, సగము రాజ్యమూను. అప్పటి కేదో మురిసించింది. ఆలోచించి చెప్పుతానన్నా పోయేదే. సర్దార్లంతా మలిదేవుడితో

పరీక్షనీ, తన బలవంతంమీద మీరంతా సగాని కొప్పు కొన్నారనీ, దాని కంగీకరించకపోతే యావత్తూ పోతుందనీ త్వరపెట్టి ఒడంబడికమీద నాచేత గీటు పెట్టించు కొన్నారు.

కే : మిగిలినదానికి విచారించ పనిలేదు. తిరిగి పాటుకు వచ్చే మార్గ మేదో యోచించాలె.

నర : ఆ మార్గాలన్నీ ఇప్పుడు మనకు తేలేవిగావు. నాగమ్మ గారికి సర్వాధికారమిచ్చి సమయోచితంగా ఆమెనే యోచించమందాం ; ఆమె కార్యఖడ్గముల రెంటికీ దీటైన మనిషి. సర్వవిధముల బ్రహ్మనాయుడికి సమవుజ్జీ. పల్నాటిమొత్తంమీద ఆమెకు బంధుజాలమంతా బీరకాయ పీచు.

నల : బ్రహ్మనాయుడి రామానుజమతములో జేరి మాల మాదిగలంతా అటు తోజౌతారు. కన్నమనీడు మాల పటాలములకు నాయకుడట. వాండ్లంతా వీరావేశముతో రాక్షసులవలె పోట్లాడుతారు. మతావేశపూరితులైనవారి నెదిరించడం కష్టం.

కే : నాగమ్మగారు వర్ణాశ్రమాల కాపాడుతారని ప్రతీతి. చాతుర్వర్ణ్యములవారికీ బ్రహ్మనాయుడి రామానుజమత మంటే ద్వేషము. నాలుగుజాతుల బలమంతా మనకు బాస టౌతుంది.

నల : ఉభయపక్షముల బలాబలములూ చూచుకోనిది యుద్ధమున కీయకొనకూడదు. తొందరపడి వున్నదీ పోగొట్టు కుంటామేమో.

**నర :** మన బలాబలా లిప్పుడు తేలవు. నాగమ్మగారికి అమాత్య పదవీ, సర్వసైన్యాధిపత్యమూ ఇయ్యంగనే మన సేనలు ఇబ్బడి ముబ్బడి గాకమానవు.

**నల :** ఏమి కేతురెడ్డీ! నీ అభిప్రాయమూ అంతేనా ?

**కే :** చాతుర్వర్ణ్యముల సంగతి అట్లావుంచినా పల్నాటిరెడ్లందరూ నాగమ్మ చావుటాకిందికి చేరకమానరు.

**నల :** అంతమటుకు నిశ్చయమే.

**వర :** ఆమె మతప్రచారంకూడా మనకు తోడ్పడుతుందనే నా అభిప్రాయము. కులభేదాలకు నాయుడు పూలుముడుచుకొని కూర్చొనడంచేత వర్ణాశ్రమధర్మాలు సంరక్షించడానికి బద్ధకంకణురాలైన మంత్రి తప్పక మన రాజ్యమునకు పెట్టనికోట.

**నల :** నాకు తెలిసినంతవరకు సర్దార్లు నాగమ్మగారివైపే మొగ్గు ; కొందరు సాధ్యమైతే బ్రహ్మనాయుడినే మంత్రిగా నియమించమంటారు. అది పొసగదు. పొసగినా మన రాజ్యానికది క్షేమము కాదు. మీ ఇద్దరి అభిప్రాయముగూడ తేల్చి చెప్పండి.

నర : నాగమ్మగారికి సర్వాధికారములిచ్చి కార్యం గట్టెక్కించమని కోరడం నా యభిప్రాయం.

**కే :** పల్నాటిక్షేమంగోరేవా రందరూ ఆ యభిప్రాయంతో ఏకీభవించక తప్పదు.

**నల :** నేనూ అదే నిశ్చయించా. ఇట్టి సమయములలో బహు నాయకం పనికిరాదు. ఇక మనకు ఆమెయే నాయకురాలు. నేనూ ఆమె ఆజ్ఞలకే కట్టుబడివుంటాను.

నర : రాజుగారి యీ నిశ్చయమువలన మనకు జయముకలిగి నట్లే భావిస్తాను.

కే : నిశ్చయం.

నర : మాటలసందున మనం గమనించలేదుగాని అడవి రాను రాను దూర సందులేకుండా పెనవేసుకొని, ఏ కొమ్మ దేనిదో చెప్పడానికి వీలులేకుండా వున్నది.

కే : ఎడం లేకపోవడంచేత ఒకదానికొమ్మ యింకొకదానికి అంటుబడుతున్నది.

నల : అది కొమ్మలకు స్వభావమే. అందుకనే చెట్లు దూరంగా నాటమన్నారు.

నర : మీరు పొరబడుతున్నారు. అన్ని కొమ్మలూ అట్లా అంటుబడవు. కొంతవరకు అది చెట్టునుబట్టి వుంటుంది.

కే : పండ్లచెట్లంటుబడతవిగాని ముండ్లచెట్లెక్కడైనా అంటు బడడం చూచారా ?

నల : ముండ్లచెట్లెవరూ అంటుదొక్కరు.

నర : పల్నాటిలో కొమ్మలు ఇతరచెట్ల కంటుబడవుగూడాను.

నల : దానికి కారణము అన్నీ ముండ్లచెట్లు కావడమే.

కే : కారణ మేదైనా, అది మాకు గౌరవమే.

నల : చూడిక్కడ, పులెడుగుల జాడ లున్నవి.

కే : పులులకేమి ? ఈ ప్రాంతమున పులులు, అడవిపందులు పట్లాడుతుంటవి.

నల : ఊళ్లదగ్గర పులులు చెర్లాడుతుంటే జనులకు భయం గదా ?

కే : ఒక్కొక్కప్పుడు పులులు ఊళ్లమీది కెగబడుతుంటే మనుష్యులు కర్రలతో కొట్టి చంపుతుంటారు.

నల : పల్నాడు యింకను పూర్తిగా మానవుడికి స్వాధీన పడ్డట్టు లేదు.

నర : ఇప్పుడునహా, వృక్షసృష్టి, జంతుసృష్టి, మనుష్యసృష్టి మూడూ స్వాధికారానికై ఒకదానితో వొకటి పల్నాటిలో పోరుతునే వున్నవి.

కే : మనుష్యుని గొడ్డలి ఎప్పుడూ వూళ్లచుట్టూ ఆడుతూ వుండవలసిందే. కాస్త ఏమార్లితే వూళ్లు అడవివేసిపోతవి.

నల : ఇప్పు డెంత ప్రొద్దయింది ?

కే : కిరణములు నిలువుగా పడుతున్నవి. రెండుజాములు కావచ్చింది.

నర : చండకిరణుడు తన యెండను గోల్పోయి చంద్రమండలము ననుకరించుచున్నాడు.

కే : కిరణములు వేడిమినిమాత్రమే కాక తెల్లదనమునూ గోల్పోయి పందిటికి గట్టిన పచ్చతీగలవలె వ్రేలాడుతున్నవి.

నల : ఆవరణముయొక్క ప్రభావంచేత యిచ్చట సర్వమూ వనసామ్యమును పొందుతున్నది.

ఎవరా యౌవనుడు ? వేట కరుదెంచిన వసంతకుమారుని వలె వున్నాడు.

కే : యౌవనము మూర్తీభవించినట్లున్నది. గాండీవము ధరించిన అర్జునకుమారుడా యేమి ?

నర : ఇట్టి పురుషసౌందర్యమును నే నెన్నడూ చూడలేదు.

నల : ఆ యౌవనమునకు యీ వనసౌందర్య మెంతో పొందికగా వున్నది.

నర : ఆయౌవన మీ సుందరవనమును సహితము యౌవనవంతము చేస్తున్నది.

నల : ఒక కొమ్మ అడ్డమువచ్చి యాతనిం గౌగలించుకొంటున్నది.

నర : లతకన్నియ లాతని వెడదయురము నలముకొని పెనవేసుకొంటున్నవి, ఏమి వాని భాగ్యము!

నల : వనమునంతా సమ్మోహింపజేస్తున్న ఆ మూర్తిని మన మాహ్వానింతాము.

నర : అది యుక్తమే. సౌందర్యము యౌవనమునకు వశవర్తినియై సపర్యలు చేస్తుందిగదా. ఈ వనసౌందర్యమునకీ యౌవనుని పట్టాభిషిక్తుని జేతాము.

నల : యౌవనము, సౌందర్యము అన్యోన్యాశ్రయములు, పర్యాయపదాలుగూడాను. యౌవను డెప్పుడూ సౌందర్యానికి పట్టాభిషిక్తుడే.

నర : సౌందర్యమునకుమాత్రమేకాదు, శౌర్యధైర్యములూ ఆతని వశములే.

నల : సుగుణములు విగుణా న్నెప్పుడూ ఆశ్రయించవు. దేహసౌష్టవమూ, మనోవికాసమూ పరమమిత్రములే. గుణసంపన్నుడయిన యౌవను డన్నిటికీ పట్టాభిషిక్తుడే.

[యౌవనుడు ప్రవేశము]

యౌవనుడు : రాజా! జోహారు ; మిత్రులకు నమస్కారములు.

కే : (నరసింగరాజుతో) అయ్యా, ఒక సందేహము. నిన్న శంకరునకు సపర్యలుచేస్తున్న, గంగాసమానురాలగు నా పవిత్రరూపమేనా యిది ;

నర : పురుషరూపమును ధరించిన నాగాంబికనా మన మిప్పుడు చూస్తున్నాము !

నాగాంబిక : అయ్యా ! యీ వేషమును మన్నింపుడు.

నల : పల్నాటిరాజ్యమునకు సర్వాధికారములతో అమాత్య పదవికి ఈమె నభిషిక్తురాలను జేస్తున్నాము.

నాగాంబిక : పల్నాటిరాజ్యమున కంతకును మిమ్మును ప్రభువునుగా నభిషిక్తుని జేస్తున్నాము.

కేతు ; నర : ఉభయుల ఆశీర్వచనములూ ఫలించునుగాక !

## ౨-వ అంకము

[ ప్రవేశము-ప్రతాపుడు ]

నేను లయకారకుణ్ణే అయినా నావల్ల లోకానికి శ్రేయస్సేకాని నష్టం లేదు. ప్రలయమే వికాసానికి తోడ్పడుతుంది. రాయిని నశింపజేసి మొక్కను జేస్తా, చెట్లను పోకార్చి జంతువులను పెంపుజేస్తా, జంతుసృష్టిని వికసింపజేసి మనుష్యుణ్ణి చేస్తా, మనుష్యుణ్ణి పశుత్వములోనుంచి మానవత్వమునకూ, దానినుంచి దేవత్వమునకూ పెంపుజేయడమే నా పని.

అజ్ఞానం పశుత్వ చిహ్నం. లోకంలో అజ్ఞానం నశింపజేయడానికి బహుప్రయత్నాలు జేస్తున్నా. లోకములోని మతకర్తలూ, సంస్కర్తలూ, బోధకులూ నా పరివారములోనివారే. అజ్ఞానముతో పోరాడి గెల్చినవాడే ధన్వి. ముల్లోకాలను జయించినవానికంటె లోకములోని అజ్ఞానమును, ధనాంధతను, నిరంకుశత్వమును నిరోధించినవాడే వీరుడు. పల్నాటిరంగములో యీ యుద్ధముకూడా ప్రదర్శిస్తా.

### ౧-వ రంగము

మాచర్ల - సభాభవనము

[బ్రహ్మనాయుడు, మలిదేవరాజు, సభికులు ప్రవేశము]

బ్రహ్మనాయుడు: మిత్రులారా! మన కిప్పటికి నిబ్బరము గుదిరింది. మాచర్ల రాజధానీనగర మయింది. మన ఆదర్శముల ప్రకారము రాజ్యముచేయడానికి అవకాశము

గలిగింది. శ్రీ మలిదేవప్రభువు పెద్దవారయి రాజ్యనిర్వహణమునకు బూనుకొనేవరకూ దానిని రక్షించే భారము మనమీద వున్నది. భారము లన్నిటికంటే రాజ్యభారము దుర్భరము.

కొమ్మరాజు : అందుకనే 'రాజ్యాంతే నరకం ధ్రువ' మన్నారు.

బ్రహ్మా : అది యెంతయు సత్యము. ధర్మాధర్మాలను నిర్ధారణ చేయడం దుష్కరం. దుష్టశిక్షణము, శిష్టరక్షణము చక్కగ జరిపినప్పుడే రాజు తన ధర్మమును నిర్వహించినవా డవుతాడు. అది చేయనినాఁడు ధర్మము నశించి, అధర్మము పెచ్చు పెరుగుతుంది. జనులు చెడునడతలలో దిగుతారు. వారి పాపమును రాజు పంచుకోవలసివస్తుంది.

కొమ్మ : రాజధర్మమును చక్కగా ఉపదేశించారు.

బ్రహ్మ : దుష్టులలోను, శిష్టులలోను చేర్పదగని దీనజనులను పరిపాలించడం రాజుయొక్క రెండవధర్మం "దుర్బలస్య బలం రాజా" అని. బలవంతులు బలహీనులను బాధించకుండా రక్షించడము ముఖ్యకార్యము. భూమి ఏభారమయినా మోయగలదుగాని ధనికుడిభారము మోయలేదు.

కొమ్మ : తమ మంత్రిత్వమున మలిదేవుని రాజ్యము నిజముగ దేవరాజ్యమై వర్ధిల్లగలదని భావిస్తాను.

బ్రహ్మ : ఈ మహాకార్యము నా వొక్కడిచే నెరవేరేదిగాదు. సరదారులు, పరిజనులు తోడ్పడినప్పుడే యీ రాజ్యతరణి సౌఖ్యముగా ప్రయాణముచేయగలదు. రాష్ట్రమునకు ప్రజలు శరీరము ; ప్రభువు శరీరి. ఇవి రెండూ పొందికగలిగి యుండినప్పుడే ధర్మనిర్వహణము కొనసాగుతుంది.

కాని యింతవరకు నే జెప్పినదంతా పురుషప్రయత్నమును గురించియే; దైవము తప్పదలంచినచో మన ప్రయత్నములన్నీ నిష్ప్రయోజనము; చెన్నకేశవుని కృప లేనిది యేకార్యమును నెరవేరదు.

కొమ్మ: పురుషకారము మూడుపాళ్లు, దైవ మొకపాలు. దైవము తప్పక అనుకూలిస్తాడని భావించియే మనము ప్రయత్నము చేయవలసివుంటుంది. మన మిప్పుడు ప్రభుత్వ నిర్వహణానికి తగిన యేర్పాట్లు చేయవలసియున్నది.

బ్రహ్మ: మీ యందరి కోర్కెమీద నన్ను రాజుగారు మంత్రిగాను, పురోహితుడుగాను నియమించారు. కొమ్మరాజుగారూ, ముతసాని పిచ్చిరెడ్డిగారూ, గండు కన్నమనాయుడుగారూ మంత్రాలోచనసభ్యులుగా వుండి నాకు తోడ్పడ ప్రార్థితులు. పశురక్షణమునకు లంకన్నా, సేనానాయకత్వమునకు మాలకన్నడూ అర్హులని నియమించినాను.

కొమ్మ: నేను క్షత్రియుణ్ణి. క్షత్రియేతరులయిన పై వుద్యోగులకు నమస్కరించవలసిన బాధ్యత లేనియెడల యీ పదవిని స్వీకరించడానికి యేసందేహం లేదు.

ముతసాని పిచ్చిరెడ్డి: కన్నమనీడు మతవిషయమున తమకూ, యుద్ధవిద్యయందు నాకూ ప్రియశిష్యుడు. తమశిష్యుణ్ణయిన నా కేయాక్షేపణా లేకపోయినా, తమ శిష్యకోటిలో చేరని చమూపతులకూ, వాహినీపతులకూ మీ కొత్తనియామకము కంటకముగా వుండక మానదు. ఈరోజు గురిజాల నుండి తెలియవచ్చిన సంగతులనుబట్టి నలగామరాజు నాగమాంబికను మంత్రిగాను, సర్వాధికారములు గల

నాయకురాలుగాను నియమించారనీ; ఆమెకు కేతురెడ్డినీ నరసింగరాజునూ సహాయమంత్రులుగ యేర్పరచారనీ తేలింది. నాయకురాలూ, కేతురెడ్డీ మాచర్లమండలము లోని రెడ్డిప్రముఖుల నందరినీ తమవైపు త్రిప్పుకొనడానికి రాయబారాలు జరుపుతున్నారు. మాచర్లమండలములో కెల్ల మహావీరుడని పేరొందిన మాడుగుల వీరారెడ్డి యీ రోజు గురిజాలకు పయనమైనట్లు తెలుస్తుంది. అతనిని బహుశా సేనాధ్యక్షుణ్ణిగా నియమిస్తారు. తమరు బాగా యోచించి యేర్పాట్లు చేయవలసిందని ప్రార్థన.

బ్రహ్మ: గురిజాల సమాచారములు నాకూ కొంతవరకు తెలిసినవి. వైష్ణవమతప్రవిష్టులయిన తమబోటివారుదప్ప రెడ్లుగాని, ఇతర అగ్రజాతులుగాని మనకు తోడ్పడుతారని తోచదు. కన్నడు మన రాజునందు అచంచలమైన భక్తిశ్రద్ధలు గలవాడు. నాయకురాలి కెన్నడూ అతడు లోబడే వాడు గాడు. మఱియు నా భావములు కన్నడు గ్రహించినట్లు యితరశిష్యు లెవరూ గ్రహించలేదు. మన రాజ్యమును పాలించేది ధర్మముగాని, వ్యక్తులు గాదనే మూలసూత్రము మనము గ్రహించితే యీ సందేహాలు పుట్టవు.

పిచ్చిరెడ్డి: సనాతనవాదులయిన చాతుర్వర్ణ్యములవారు తమకు తోడ్పడరని నిశ్చయమేనా?

బ్రహ్మ: చీకటి వెలుతురుకు తోడ్పడితే వారు మనకు తోడ్పడుతారు.

పిచ్చిరెడ్డి: అట్లయితే ధీశక్తిచేత తమరు సంపాదించిన రాజ్యం మలిదేవమహారాజుకు నిలువడం దుర్ఘటం.

బ్రహ్మ : మనము ఆ ఐహిక రాజ్యాన్ని ఆను జేసికొని, ఆముష్మిక రాజ్యాన్ని స్థాపించవలెనని అనుకొంటున్నాము. ఇహాము ఆముష్మికానికి మెట్టుగా వుండాలె. వర్ణ భేదాలు సమత్వ ధర్మానికి ప్రతిబంధకాలు. స్వల్పకాలమయినా స్వర్గమే అనుభవింతాము.

కన్నడు : ఈ యేర్పాటు కొంత యోచించి చేయరాదా ?

బ్రహ్మ : దాసూ ! యేర్పాటు అయిపోయినది.

బాలచంద్రుడు : మన మీ క్షణమునుంచీ వర్ణ భేదాలను నిర్మూలంజేసి మన ధర్మం విస్తరింపజేయాలె.

[ సేవకుడు ప్రవేశము ]

సేవకుడు : అయ్యా, గురిజాలనుండి రాయబారి వచ్చి కాచుకొని వున్నాడు.

బ్రహ్మ : గురిజాలనుంచా ? రాయబారా ? అవశ్యము లోపలికి తీసుకొనిరా.

( సేవకుడు నిష్క్రమించును )

కొమ్మ : కొత్తమంత్రిణి సంధి కోరుతున్నదేమో ?

బ్రహ్మ : కాదు, విగ్రహామే కోరుతుంది. వారు సంధి కోరదగిన పరిస్థితు లిప్పుడు లేవు.

[ రాయబారి ప్రవేశము ]

బ్రహ్మ : పొడిలె పాపన్నగారా ! రండి.

పాపన్న : అయ్యా, క్షమించండి. ఇక్కడ ప్రభు వెవరో, నమస్కార మెవరికి జేయవలెనో తెలియడంలేదు. వేంలేని ప్రభువుకు నమస్కారము.

బ్రహ్మ : మీరు వచ్చినది రాయబారమునకా, తగవులకా ?

పాపన్న : నాకు గలిగిన సందేహమును వెలిబుచ్చినాను.
బ్రహ్మ : ఎందుకు మీ కీ సందేహము గలిగినది ?
పాపన్న : ఇక్కడ ప్రభువు రాజనామధారుడో లేక రాజప్రతినిధో మాకు దెలియదు. రాజు బాలుడుగాబోలు. వారిపై అధికారముగల పాలకు లెవరు ?
బ్రహ్మ : మేమే.
పాపన్న : మీ కీ యధికార మెవరిచ్చారు ?
బ్రహ్మ : రాజుగారే యిచ్చారు.
పాపన్న : బాలు డిస్తే చెల్లుతుందా ?
బ్రహ్మ : యువరాజుకోసము రాజ్యమును మేమే సంపాదించాము.
పాపన్న : అనగా మీరే హక్కుదారులు ?
బ్రహ్మ : రాజుగారిదే రాజ్యము.
పాపన్న : మీరు వారికి వ్రాసి యిచ్చారా ?
బ్రహ్మ : వ్రాసి యియ్యడ మెందుకు ? రాజ్యము వారిదే.
పాపన్న : రాయబారము మీతోనే జరుపుతాను. ఉత్తరము చదువుకొన్నారా ?
బ్రహ్మ : చదివాను.
పాపన్న : ఏమి జవాబు ?
బ్రహ్మ : మా రాజ్యము మీ కిచ్చుటకు వీలులేదు.
కొమ్మ : ఉత్తరములో నేమున్నది ?
బ్రహ్మ : ఏమున్నది ? దుండగపు మాటలు. నలగామరాజును మోసపుచ్చి మండలము తీసికొన్నామట. తిరిగి యిచ్చి వేయడమో లేక వారికి సామంతులుగా వుండి పాలించుకోవడమో జరుపవలెనట.

కొమ్మ : రెంటికీ మన మంగీకరించకపోతేనో ?
బ్రహ్మ : దానికి జవాబు వుత్తరములో లేదు.
కొమ్మ : రెంటికీ అంగీకరించమని జవా బియ్యండి.
పిచ్చిరెడ్డి : తొందరపడవద్దు.
కొమ్మ : ఆ ఉత్తరానికి జవా బంతే.
పి. రె : వారి కోర్కెలను మన మంగీకరించనియెడల యేమి చేస్తారో చెప్పలేదు గనుక ఉత్తరము సౌమ్యముగా వున్నది. సంధిమాటల కవకాశ మిస్తున్నది.
కొమ్మ : రెండునెలలనాడు రాజ్య మిచ్చి, ఈ రోజు మళ్లీ తెమ్మనమంటే రాజీ యేమున్నది ?
అలుగురాజు : ప్రతిపక్షముయొక్క దృష్టితోగూడా మనము యోచించాలె.
బాలచంద్రుడు : అనగా ?
అలుగురాజు : వారు చెప్పేకారణాలు కేవలము నిరాధారములు గావు.
కన్నడు : మోసముచేశామంటూరా ?
అలుగు : కేవలము మోసముగాదు. ఖిడియపెట్టాము.
బ్రహ్మ : రాజ్యము ఇచ్చివేతామంటూరా ?
అలుగు : రాజీగా బోదాము.
పి. రె : పోరునష్టం - పొందులాభం.
బ్రహ్మ : వారికి లోబడివుండడం గిట్టకనేగదా పంచుకొన్నాము ?
పి. రె : ఇప్పటికీ వెనుకటికీ భేద మున్నది. మన హక్కును వా రంగీకరిస్తున్నారు.
బ్రహ్మ : సామంతరాజును తొలగించే అధికారము రాజు కుండదా ?

పి. రె: మన బలాన్నిబట్టి వుంటుంది.

బా. చం: అది యిప్పుడే తేల్చుకుందాము.

పి. రె: ఇప్పుడు మనకు ప్రతిఘటించే బలమున్నదా ?

బ్రహ్మ: బుద్ధిపూర్వకంగా చేతులో వున్న రాజ్యం వదులుకొని నాగమ్మచేతికి పోదామంటూరా ?

కొమ్మ: బ్రతికిన నాలుగురోజులయినా పౌరుషంతో జీవించాలె. రాజు క్షత్రియుడు. మంత్రి వెలమదొర. మీకు తగినరీతిగా వర్తించండి.

బా చం: వెలమలు కత్తికింద నలిగినవారుగాని కాడికింద నలిగిన వారు గారు. నలగామరాజు కాడి మన మెడమీద మోపితే నాగమ్మ ఛో అనడం ఆరంభిస్తుంది.

పి. రె: బింకాలతో లాభంలేదు.

కన్నడు: మాలకన్నడు జీవించివుండగా మాచర్లకు భయం లేదు. అవమానకరమయిన సంధి పనికిరాదు.

బా. చం: సంధికి యితరు లంగీకరించినా మే మంగీకరించము.

అనపోతు: సత్యం.

చాకలిచందన్న: మగసిరైన జవాబు చెప్పావు.

పాపన్న: మాచర్ల గురిజాలతో పోరడం పొటేలు కొండను ఢీకొన్నట్టే.

బ్రహ్మ: ఇప్పుడు యుద్ధపుమాటల ప్రసక్తి లేదు. పాపన్న గారూ ! జవాబు యోచించి పంపిస్తాము.

పా: చిత్తము, సెలవు. ( నిష్క్రమిస్తాడు. )

బ్రహ్మ: ఈ రాయబారంధర్మాన మన కర్తవ్యం స్పష్టంగా తేలింది. మనం సేనలన్నీ వృద్ధిచేసుకోనే పనిమీదవుండక తప్పదు.

పి. రె : మనము అన్నికులములవారూ సేనలో చేరే సౌకర్యాలు చేస్తే మంచిది.

బ్రహ్మ : మనకు ధర్మచ్యుతి లేకుండా ఇతరకులములు చేరితే సంతోషమే. సైనికులకోసం సనాతనధర్మ పాదులం కాజాలము. మతస్వాతంత్ర్యంకోసమేగదా గురిజాల నుండి విడిపోయివచ్చాము. మన మతధర్మాలను స్పష్టంగా లోకానికి వెల్లడించి ఆచరణలో పెట్టినప్పుడే మనకు బలము చేకూరుతుందిగాని ; చెప్పేది వొకటి, చేసేది మఱొకటిగా వున్నంతకాలం మనధర్మము నెవరూ పాటించరు. కన్నమ నాయుడి కొమార్తెను బాలచంద్రుడి కివ్వడము నిశ్చయ మయింది. లగ్నమయిన వెంటనే చెన్నకేశవస్వామి సన్నిధిన గోష్ఠి జరిపించి చాపకూటి సంతర్పణ చేస్తారని చాటించవలసి నది. దానికి తగిన ప్రచారకు లెవరు ?

బా. చం : నా స్నేహితులలో ప్రచారకులుగా వుండదగిన వాం డ్లనేకులున్నారు. వారిలో బాపన అనపోతురాజు, వెలమ దోర్నీడు, చాకలి చందన్న, కుమ్మర తేర్కుడు, అగసాలి చందన్న, మంగలి మంచన్న ముఖ్యులు.

బ్రహ్మ : మిమ్ములను నా తోడిప్రచారకులుగా నియమించు తున్నాను. మన మందరమును భగవంతుని సేవకులము. మనలో అంతరములు లేవు.

పి. రె : రెడ్డిప్రచారకు లెవరూ దొరకరా ?

బ్రహ్మ : నీవుదప్ప రెడ్డిప్రచారకుడు మరొకడు దొరకడు. దొరికితే సంతోషమే. విచారించండి. సోదరులారా !

చా. చందన్న : అయ్యా ! తమరు ధర్మసంస్థాపనకొరకు అవతరించిన మహాపురుషులు. మే మందరమును తమ

అనుచరులము ; సేవకులము. సోదరులారా ! అని పిలవడం మాకు క్షేమంగాదు.

బ్రహ్మ : మన మందరమూ భగవంతుని సేవకులము. ధర్మ నిర్వహణమునకై భగవంతు డుపయోగించు సాధన ములము. భగవంతుని యెదుట అంతస్థుల భేదము లేదు. భగవంతు డేర్పుకొన్న పనిముట్లు కొన్ని యెక్కువనీ, మరి కొన్ని తక్కువనీనా ? భగవంతుని కృపచేత మన ప్రయత్నములు విజయము గాంచునుగాక !

౨-వ రంగము

[ సావడి - బ్రహ్మనాయుడు, కన్నమనీడు ప్రవేశము ]

కన్న : నాన్నగారికి నమస్కారము.

బ్రహ్మ : బాబా ! తలంబ్రాలు గావడంతోటే గోష్ఠి ప్రారంభింతాము. వంటలయినవా ?

కన్న : రెండువేలమందికి మాత్రమే ముందు ప్రయత్నం జరిగింది. జనము అనుకొన్నకాడికి యిబ్బడి ముబ్బడయ్యే టట్టున్నది. మరి పదిమంది కుమ్మరులను పిలిపించి అన్నం వండించి పోయిస్తున్నా. సాదం చాలినంత వుంటే సాధకం వెనుకా ముందూ సర్దుకోవచ్చు. తళియలు యెన్నిగంటల కుంచమంటారు ?

బ్రహ్మ : తళియలంటే జ్ఞాపకంవచ్చింది. తగాదాలు రావుగదా?

కన్న : చాపకూటిపద్ధతికి అంగీకరించినవాండ్లుమాత్రమే గోష్ఠికి రావలసినదని ప్రకటించా. అందువల్ల తగాదా లేమీ రాకూడదు.

బ్రహ్మ : ఏ యే కులాలు వచ్చినవి ?

కన్న : బ్రాహ్మణులు, వెలమలు, రెడ్లు స్వల్పంగా వచ్చారు. కోమట్లు రాలేదు. అలగాలు విశేషంగా వుంటారు. అందరికంటె మాలమాదిగ లెక్కువ.

బ్రహ్మ : కోమట్లసలే రాలేదా? ఎందువల్ల?

కన్న : లేదు, వారికి బ్రహ్మ వ్రాసిందో, బ్రాహ్మడు జెప్పిందో దప్ప మరొకటి పనికిరాదట.

బ్రహ్మ : భరన్యాపకలాపం యీరోజు జరుపుదామా?

కన్న : కొందరందుకోసం ప్రత్యేకంగా వచ్చారు. తమరు అనుగ్రహిస్తే నేనుకూడా అడ్డంకి తీర్చుకొనవలెననే వున్నది.

బ్రహ్మ : ఇంకా ఎవరెవరున్నారు?

కన్న : మంగళగిరినుంచి ఒక మాలదాసరిస్వామి వచ్చారు. బ్రహ్మతేజం వుట్టిపడుతున్నది. కేశవస్వామిసన్నిధిన తమ ద్వారా భరన్యాసం పొందవలెనని వున్నదట. భగవంతుని యొక్క సర్వమయత్వం ఆయన కనుతుణమూ అనుభవములో వున్నట్టున్నది. సమదర్శనులంటే వారినే చూచాను.

బ్రహ్మ : వారిని తప్పకుండా వెంటబెట్టుకొని తీసుకురా. ఏమిటా కలకలం?

కన్న : మనవాండ్లదే. నగరసంకీర్తనం జరుగుతున్నది. దేవాలయమువైపుగా వస్తున్నారు.

బ్రహ్మ : నేనుకూడా వచ్చి కలుసుకుంటూ, పద.

## ౩-వ రంగము

[మాచర్ల వీథి—అర్చకుడు, రెడ్డి వగైరాలు ప్రవేశం]

రెడ్డి : ఓ స్వామీ! ఇదేమి కలికాలమండీ?

పాట

[ శంకరాభరణం - చతురశ్రగతి - ఏక. ]

మాలకన్నడు - చాకలిచందడు - మంగలిమంచన్న
జట్టుగట్టుకొని - సేవజేతురట - చెన్నకేశవులకు
కులకట్లిప్పుడు - వీరలందరు - కూలద్రోతురంట
మొదటవిజేసినవారికంతెను - మొనగాండ్లీరంట
బ్రహ్మనాయుడీ మాలగుంపులకు - పట్టుగొమ్మయంట
సేనల - బెట్టి పోరునంట
గుడిలో - కొట్టి దూకునంట
మనలను - నెట్టివేయునంట
సాములుమీరే - శ్రద్ధదీసుకొని - సరిపెడుదురు రండి.

అర్చ : ఇవ్వేళ గుళ్లో మీ సేవేనా ?

రెడ్డి : ఇంకేమిసేవ స్వామీ! అన్నీ అంతానికి వచ్చినవి. కలియుగం ముంచకవస్తున్నది.

అర్చ : ఆ గోలేమిటి ?

రెడ్డి : ఇంకా మీకు తెలియదూ? మాలగుంపు వూరేగుతూ గుళ్ళోకి పోతున్నది.

అర్చ : అయ్యో! అయ్యో! మాలగుంపే! వచ్చిపడుతున్నది.
మాదిగమల్లిగ - కుమ్మరితేర్కడు - మంగలిమంచన్న
పాప మప్పుడే - కలియుగమంతట - పండిపోయెనటర
తోళ్లగాబులో - దేవునిముంచి - తొలిచిపెడుదువటర
తోళ్లకంపుతో - చన్నకృష్ణుడికి - ధూపమేతువటర
ఆవము - బెట్టి కాల్తువటర
మాంసము - బెట్టి ప్రోతువటర

పొదిలో - బెట్టి యూతువటర
చన్నకృష్ణు డీ - పూజలకెల్ల - సమ్మతించునటర ?

కుమ్మరి తేర్కుడు :

చన్నకృష్ణుడు - త్రిప్పుచుండు తన - సారెను యెల్లపుడు
చిత్రచిత్రముగ - ఘటములనెల్ల - చేస్తువుండు నెపుడు
అగ్గిబుగ్గితో - అతని ఆవము - ఆరిపోవ దెపుడు
పాతకుండలను - పోగుజేసి మఱి - పగులగొట్టు నతడు
కులముల - గౌరవింప డతడు
గుణముల - గొప్పసేయు నెపుడు
పాపము - పరిహారించుతాడు
పెద్దకుమ్మరని - చెన్న కేశవుడు - పేరుబొందినాడు.

పెద్దసెట్టి :

గుళ్లుగోపురాల్ గట్టి దేవునికి - కొలువు సేయగలరా
రత్నకిరీటము బెట్టి కేశవుని - రంజింపంగలరా
అమ్మవారికి పైడికంటెలను - అర్పించంగలరా
యేమిబెట్టనిది దేవుడు మీకు - యెట్లు కండ్లబడురా
వూరికె - వచ్చిదూకునటరా
కోరికె - లిచ్చిపోవునటరా
ఆశల - కంతు వుండదటరా
చిలుమువదలనిదె - యెవ్వడికైనను - ఛిద్రము బోనటరా.

బ్రహ్మనాయుడు :

పేదసాదల భేదమెరుంగని - పెద్దప్రభువతండు
చెన్న కేశవుని సాన్నిధ్యంబున - సతతముండగనుడు
చిన్నికృష్ణుని చరణసేవనే - సేయుచుండు డెపుడు

చన్నకృష్ణుని - చక్కదనంబును - సందర్శింపగ రండు
ముద్దుకృష్ణుని మురళీనాదము - మోగుచుండు వినుడు
తలచిన - తలపు లెరుగు నతడు
పిలువక - పలకరించువాడు
పేదల - పెద్ద జేయు ఘనుడు
పండిత పామర భేదంబులను - పాటింపనివాడు.

క. దా : ఆహో ! నా హృదయం పొంగిపోతున్నది. ఏడీ చెన్న కేశవుడు ? సేవించంది నే వుండలేను.

బ్రాహ్మణుడు ; ఎట్లా సేవిస్తావు ?

క. దా : వెళ్లి ఆలింగనంచేసుకుంటా. అంతటితో నా తాపము ఆరిపోతుంది. అయ్యో నే భరించలేను.

బ్రాహ్మ : జన్మానా స్నానం జెయ్యని యీ మురికిశరీరంతో నేనా, నీవు ఆలింగనం చెయ్యడం ? చెన్న కేశవుడు మైలబడడూ ?

కన్నమదాసు: మైలబడతాడా, అయ్యో! మరెట్లా? దూరంగా వుండి రెండు పూలు ఆయన పాదాలమీద పెట్టి చిన్నంగా వత్తుతా.

బ్రాహ్మ : నీ చేతు లింకా తోళ్లకంపుకొడుతూనే వున్నవి. వాటితోనే అంటుకుంటావూ ?

క. దా : స్వామి సన్నిధిలో ఆయన వినేటట్టుగా కీర్తనలయినా పాడుకుంటా.

బ్రాహ్మ : బ్రాహ్మణుల నోట వచ్చే సామగానాలు వినేవాడు, నీ బొల్లిపాటలు వినవచ్చాడా ?

క. దా : అయ్యో, వినడా, మరి నా గతేమి ? పోనీ ఎదటికి పోయి కండ్లతో నయినా చూస్తా. ఆ రూపం కండ్లతో జూచి ఆనందిస్తా.

బ్రాహ్మ : బ్రాహ్మలు, కోమట్లు పట్టుబట్టలతో ఆలయం నిండి పున్నారు. ఇది సేవాకాలం.

క. దా : అయితే నే నేమి జెయ్యను ? నిలువలేనే. నాన్న గారూ ! ఏమి మార్గం? నాకు పిచ్చెక్కుతున్నది.

బ్రహ్మ : ఆయన్నే పిలువు, వచ్చి దర్శన మియ్యమని.

కన : కేశవా ! తండ్రీ ! నిన్ను చూడందే నిలువలేను. చెన్న కేశవా !

అదుగో కేశవుడు. ఆకాశమంతా కేశవుడే భూమంతా కేశవుడే. నా వొళ్లంతా కేశవుడే. నా లోపలా కేశవుడే !

పాట

[ హిందుస్తాని - ముఖారి - ఆదితాళము ]

దర్శనమాయె - సం - దర్శనమాయె
విశ్వ - రూపుని - దర్శనమాయె
దర్శనమాయె - సందర్శనమాయె—వి ॥
కేశవాయని - కేక వేయగ
ఏకరూపమున - లోకమంతటను
దర్శనమాయె—వి ॥

బ్రహ్మ : ఆర్యులారా ! భగవత్కృపవలన కన్నమదాసుకు భగవత్సాక్షాత్కారము గలిగినది. అతడు ధన్యుడు. మనము ఈ సమయముననే మన వీరవైష్ణవమతముయొక్క ధర్మములను లోకమునకు వెల్లడించి వాటిని ఆచరణలో బెట్టుటకు ప్రయత్నింతాము.

శ్రీమన్నారాయణునియందు భక్తి గలిగి ఆయన కృపాతిశయముచేత మోక్షమును పొందగలరు. వీరవైష్ణవు

లందరు కులభేదములు పాటింపక సమభావముతో వర్తించ వలసివున్నది. దయా సత్య శౌచములు ప్రతిమానవుడు అవలంబించవలయును. ఇవి వీరవైష్ణవమతము యొక్క ప్రధాన సిద్ధాంతములు.

బ్రాహ్మ : పంచమాది కులములతో సాహచర్యము అనర్థదాయకముకాదా ?

బ్రహ్మ : అగ్రవర్ణముల వారికంటె పంచము లెక్కువ దుర్మార్గులు కారు. అందుచేత వారితో సాహచర్యమువలన యే అనర్థమును రాదు. ఆరోగ్యవిషయమున వారి అలవాట్లు కొన్ని సరియైనవి కావుగాని ఆ విషయమున వారిని బాగు చేయవలసిన భారము అగ్రవర్ణములమీదనే నిలచివున్నది. అసహ్యామునకోర్చి శిశువులను తల్లిదండ్రు లేవగించపక యేవిధముగ సాకుతారో అగ్రవర్ణములవారందరూ శిశు ప్రాయులుగా వున్న పంచములను పుత్రప్రేమతో ప్రేమించి బాగుచేయడము ధర్మము. తల్లిదండ్రులకు శిశువు లెట్లు అస్పృశ్యులుగారో, పంచములూ అగ్రవర్ణములకు అస్పృశ్యులు గారు. వారిని ప్రేమించి బాగుచేయుట ఉభయులకూ తరణోపాయమే. మన హృదయముల యందు ప్రేమ వున్నయెడల వా రస్పృశ్యులు కావడమునకు మారుగా మన హృదయాలింగమునకే అర్హులవుతారు. ప్రేమ లేకపోవడమే మన భేదములకు కారణము. పండితులు అందరియందూ సమదర్శనులే. విశ్వదృష్టి గల వాడికి తిరుపతికొండ యొక్క ప్రతిరాతియందూ శ్రీ వేంకటేశ్వర్లే కనబడుతాడు. ఆత్మ యొక్క విశ్వమయ

త్త్వము గోచరించినవాడికి ఏభేదములూ కనపడవు. భేదముల కజ్ఞానమే మూలము.

వీరవైష్ణవులలో భోజన ప్రతిభోజనములకు అడ్డుండ గూడదు. మీ రందరు శంకలు విడిచి నిష్కల్మషహృదయ ములతో చాపకూడు భుజించి సమభావమును వెల్లడించ వలెనని నా కోరికె.

బ్రాహ్మ : భోజన ప్రతిభోజనములకు మీరింత ప్రాముఖ్య మియ్యడమెందుకు ?

బ్రహ్మ : కులభేదములను రక్షించే కంచెగోడలు భోజన ప్రతి భోజన నిషేధములే. శాస్త్రములు కులములమధ్య అనులోమ, ప్రతిలోమ వివాహము లంగీకరించి భోజన ప్రతి భోజనములు నిషేధించినవి. అన్యోన్యవివాహములకంటె భోజన ప్రతిభోజనములే సమభావము గల్గించడమున కెక్కువ తోడ్పడుతవి. కనుక ఈ విభేదమును మీరు ముందు కొట్టివేయవలసివున్నది.

అందరు : శ్రీమద్రమారమణగోవిందోహారి.

బ్రహ్మ : వీరవైష్ణవు లందరు సమానమయిన మతహక్కులు కలిగివుంటారు. వేదములు పక్షపాతము జూపినయెడల అవి త్యాజ్యములు. యజ్ఞోపవీతము అందరును వేసికొన గూడనిచో, నా సోదరునికి నిషేధింపబడినది నాకూ పనికి రాదు. సంస్కృతము అందరూ చదువగూడనియెడల అదీ వర్జనీయమె. దీనికే త్రివిధసన్యాసమని పేరు. సమ దర్శన భావమునకు ప్రతిబంధకములయిన యీ మూటిని త్యజించినవాడే ఉత్తమ సన్న్యాసి.

అందరు : శ్రీమద్రమారమణగోవిందోహరి.

బ్రహ్మ : అయ్యా! తమ రందరు భోజనానికి లెండి.

[ అందరు లేతురు, తెరపడుతుంది. ]

౪-వ రంగము

బ్రహ్మనాయుడి సావిడి

[ బ్రహ్మనాయుడు, కన్నమనీడు ప్రవేశము ]

బ్రహ్మ : కన్నా! బండి రోడ్డెక్కిందనుకున్నాం. మళ్లీ రొంపిలో కూరుకున్నది. నాయకురాలు కొరుకులువేసింది లాగడం కష్టం. వదలిపెట్టి పోలేము. నరసింగరాజును మంత్రిగా నియమించినట్లయితే సమదీటుగా వుండే వాండ్లము. కాని అతడు గొప్ప త్యాగమే చేశాడు.

కన్న : మనిషి దుర్మార్గుడయినా అన్నయందు మిక్కిలి గౌరవం. మాచర్ల మన కియ్యడము అతని కేమాత్రం యిష్టంలేదు.

బ్రహ్మ : నరసింగరాజు చాలా దూరదృష్టిగలవాడు. నాయకురాలిని నియమించడం అతని సలహాయే అను కుంటాను. దానితో రంగమంతా మారిపోయింది. కాయలను వెనుకకు తిప్పకపోతే ఆట కట్టుతుందేమో.

కన్న : ఎత్తుకోవడంతోనే పహా అన్నదే నాయకురాలు.

బ్రహ్మ : మనము వెనుకకు తగ్గినంతమాత్రముచేత వెంటబడే మనిషిగాదు. పక్కదాట్లుకూడా కాచుకోవాలె.

కన్న : ఆమె కత్తికీ, కార్యాలోచనకూ కూడా మన మెదురడ్డ గలము గాని దేశములో ఆమెకున్న పరపతి ప్రతిఘటించడం దుర్ఘటం. మనకు మంది చాలుగాని మార్బలం తక్కువ.

బ్రహ్మ : మనకు దైవబల మున్నది. దానికి మించింది లేదు.

కన్న : అది సరే, మాచర్ల చన్నడు మనకూ, గురిజాల యిష్ట కామేశుడు ఆమెకూ వున్నారు. ఆ బలాలు మినహాయించి. మనం మాట్లాడుదాం.

బ్రహ్మ : నాకు ప్రతివీరు డేడీ? ఆఁ——

కన్న : అటు తమకు ప్రతివీరుడు లేనిమాట వాస్తవం.

బ్రహ్మ : నీవు, బాలుడు, అనపోతు, లంకన్న నాతోటివాండ్లే.

కన్న : అపచారం. తమ తరువాతివాండ్లం.

బ్రహ్మ : అటు రాజు ధైర్యంజేసి రణరంగంలో నిలిస్తే అమోఘంగా పోట్లాడుతాడు. నాయకురాలు, నరసింగ రాజు, వీరారెడ్డి అతిరథులలోనివాండ్లే అయినా అటు నాయకబలం తక్కువ.

కన్న : సేనలు లేనిది నాయకు లేమిచేస్తారు? మనకు పంచము లెందరు పోగయినా వారి సేనలో పదోవంతుండరు.

బ్రహ్మ : మనవాండ్లకు మతోత్సాహ మెక్కువ. అటుసైని కులు శిక్షలో ఆరితేరినా మనవాండ్ల మతోత్సాహం ముందు నిలువలేరు

కన్న : నాయకురాలి భేదం కనిపెట్టకపోలేదు. వర్ణాశ్రమ రక్షణ మనే పేరుతో ఉత్సాహం పెంచుతుంది. అయినా మనవాండ్లకున్న తెంపు వాండ్ల కుండదు.

బ్రహ్మ : అంతకంటె పైయెత్తుకూడా యెత్తింది. పల్నాడు చింపి చీలికెలు చేస్తున్నామట.

కన్న : అదీ నిజమే. ఇవ్వాళ యిద్దరు పంచుకొంటే రేపు పదిభాగాలవాండ్లు బయలుదేరవచ్చు. తను కెట్లావుందో గాని పంపిణీ నాకుమాత్రం నచ్చలేదు.

బ్రహ్మ : పదిచీలికలు గాదు, పదివేల చీలికలయినా నా కిష్టమే. ప్రభువులకు పంచడమేగాదు, పల్నాడంతా పరిజనుల కందరికీ పదిలక్షల చెక్కలుజేసి, పంచిపెట్టి, యే బాధలూ లేకుండా వ్యవసాయం చేసుకొని జీవించమని చెప్పడమే నా కిష్టం. ఎన్నిభాగాలు చేసినా పల్నాడు పల్నాటి ప్రజలకే వుంటుంది.

కన్న : ఈ దృష్టితో జూస్తేతప్ప మీ పల్నాటివిభజనం నాకు నచ్చలేదు.

బ్రహ్మ : అందుకనే నాయకురాలు పల్నాటిని బలవంతంగా పంచుకొన్నామని చెప్పేది సులభంగా జనులమనసు కెక్కుతున్నది.

కన్న : మీ సిద్ధాంతం చాతుర్వర్ణ్యములవారికి నచ్చుతుం దనుకోను.

బ్రహ్మ : పోనీ, నచ్చినవాండ్లే మనతో చేరుతారు. అందుకనే పంచములే కావలె నంటున్నా.

కన్న : చివరకు మీ పోరాటము పంచమ-పంచమేతర తగాదా లోకి దిగుతుంది.

బ్రహ్మ : అంతకంటె బీదల-భాగ్యవంతుల తగాదాలోకి దిగుతుం దంటే సరిపోతుంది.

కన్న : సత్యాసత్యముల తగాదా అంటే యెక్కువ బాగా సరిపోతుందేమో ?

బ్రహ్మ : ఒప్పుకొన్నా. నా సిద్ధాంతం నీ కర్థమయినట్టు మరెవరికీ అర్థంగాలేదు.

కన్న : నే ధన్యుణ్ణి. తమ ఆజ్ఞలను శిరసావహించి ఆచరణలో పెడతా. పాపన్న రాయబారానికి యేమి జవాబు వ్రాస్తారు ?

బ్రహ్మ : వ్రాసే దేమున్నది ? అప్పుడు జరిగిన సంభాషణే జవాబు. దానిమీద నాయకురాలు ఏదారికి వస్తుందో చూడాలె. మనం వాండ్ల యావలు దీస్తూ మతప్రచారమూ, తద్వారా క్రొత్తసైనికులను చేర్చుకోవడమూ యెడతెగకుండా జరపాలె.

కన్న : చిత్తము.

[ తెరపడుతుంది ]

## ౩-వ అంకము

[ ప్రవేశము - ప్రతాపుడు ]

ప్ర : లోకమంతా ఒక పెద్ద కసాయిదుకాణం. మారణకర్మ అవిచ్ఛిన్నంగా జరుగుతూనే వుంటుంది. హింసాదోషంమాత్రం నా కంటదు. ప్రపంచములో ఎవరిమీదా ద్వేషంలేకుండా ప్రేమతో చంపేవాణ్ణి నే నొకణ్ణే. రణసాధనాలు—అంటే మారణసాధనాలు—ప్రపంచమంతటా అమర్చిపెట్టా. కొమ్ములు, కోరలు, గోళ్లు, గిట్టలు, కొండ్లు—ఇవి నా పంచబాణాలు. వీటితో నా పని ముప్పాతికె మువ్వీసం తెమిలిపోతున్నది. కత్తి మొదలయిన కృత్రిమసాధనాలు యెప్పుడోగాని వుపయోగించను.

పల్నాడు నా ప్రేయసి. నా పౌరుషం పల్నాడంతా వెదజల్లే. ఎక్కడజూచినా నా భీకరరూపమే ప్రత్యక్షమవుతుంది. పళ్లలో కత్వలు, ఎత్తిపోతలు, సుడిగుండాలు తప్ప యెక్కడా యిసుకతిన్నెలు లేవు. గులకరాళ్లు, నాపరాళ్లు, చెకుముకిరాళ్లు, పలుగురాళ్లు మొనలుదేలి కత్తులున్నట్టుంటవి. ఇక్కడ పండ్లచెట్లకంటె ముండ్లచెట్లెక్కువ. పరాయిదేశపువాడు అక్కడి పశువులను పట్టుకోవలెనంటే చిక్కవుగదా! స్త్రీపురుషులు ఆబాలగోపాలము అంతా వీరులే. ఆంధ్రదేశములో పల్నాటికి వీరభూమని పేరు.

౧వ-రంగము

అభ్యంతరమందిరముయొక్క పంచపాళి.

[ ప్రవేశము - నాయకురాలు మేజాబల్లమీదకూర్చొని ]

నాయకురాలు : (స్వగతం) రెండుజాములకు మిగిలింది. నిద్దుర పట్టదు. కందిరీగలవలె తలంపులు నన్ను పట్టి పల్లార్చు తున్నవి. చుక్కలకంటె మిక్కిలయినవి. దిక్కుతోచడం లేదు. గగనచారులైన ఓ గ్రహసత్తములారా! లోకమున కంతకూ భావిసూచకులయిన మీరైనా మార్గము సూచించ లేరా? లేక మీశక్తికికూడా మించిందా?

శ్రుతిమించి రాగాన పడుతున్నది. సమత్వమను పేరు పెట్టి మాలమాదిగలను రెచ్చగొట్టి అందరిమీదికి ఎక్కొలుపు తున్నాడు. ఏమిఘోరము! చాపకూడట. సర్వము జగన్నాథమయిపోతున్నది. చన్నకేశవాలయము చండా లులపర మయినవి. అంతయు చెడినది. వర్ణాశ్రమధర్మాలు వరద గలిసినవి. వేదములు, యజ్ఞోపవీతములు త్యాజ్యము లట. సంస్కృతము పనికిరాదట. వ్యాస వాల్మీకాది మహా కవుల విజ్ఞానామృతము పందికి పన్నీటివలె వీరికి పనికిరాదు గామాలె. బ్రహ్మనాయుడా! నీకై అంతగా వగవనుగాని నీవు జన్మించి పల్నాటిని పరిహాసాస్పదము జేస్తున్నావని నాకు విచారము.

మాలలు, మంగలులు, చాకలులు, కుమ్మరులు మత ప్రచారకులట! వీరాధివీరుడయిన పిచ్చిరెడ్డి మాలకన్నడి క్రింద వాహినీపతి. పండువంటి బ్రాహ్మణుడు—ఆ అన పోతును—మాలపోతులలోగలిపావు. నీ మతప్రచారకుల

ముందు మన్వాది మహర్షు లేలపనికివస్తారు? చెట్టు చెడు కాలమున కీ కుక్కమూతిపిందెలు. దేశాన్ని పంచుకొని తినే పాలకులు, స్వార్థపరులై పరులనాశ్రయించి పైకి రాగోరే ప్రజలు. దేశ మీ దుర్గతికి వచ్చింది.

ఎందుకీ గంట? ఎవరురా అది?

నౌకరు: (ప్రవేశించి) సహాయమంత్రిగారు అగత్యముగా తమతో మాట్లాడగోరుతున్నారు.

నాయ: ఇప్పు డెంతపొ ద్దయినది?

నౌక: తోలికోడి కూసింది.

నాయ: మెల్లాలోకి తీసుకొనిరా. [ఇద్దరు వెళ్లుతారు]

[నాయకురాలు, నరసింగరాజు ప్రవేశము]

నాయ: రాజుగారూ! దయచేయండి. తమకు నిశాచరత్వ మబ్బినట్టున్న దే?

నర: సాహచర్యదోషం.

నాయ: నాకు ఈ రాత్రంతా అనిమిషత్వ మబ్బిందిగాని రాత్రించరత్వం పట్టలేదే!

నర: నిశాచరులూ ఒకప్పు డనిమిషులే. ఈ రాత్రి నాకు రెండుగుణాలూ ఏకకాలమందే పట్టుబడ్డవి. రాత్రి గంగవరం బోయి కట్టుబోతును పట్టుకొని వచ్చా, వాడి మాయకోడిని యాభై మొనగాడికోళ్లమీద వదిలి చూశా. ఒక్కొకదానికి అయిదునిమిషాలు పట్టలేదు. వరుసగా నరికి పోగులుబెట్టింది.

నాయ : చిత్రం! కారణ మేమని వూహిస్తారు?

నర : తాను మంత్రకట్టు కట్టాననీ, ఎదటికోడిదెబ్బలు తనకోడికి తగలవనీ అంటాడుగాని నే నమ్మను.

నాయ : మఱి మీ అభిప్రాయమేమిటి? ఏదో అసాధారణ ప్రజ్ఞ కొంత వున్నదంటారా?

నర : మంత్రక ట్టనుకోనుగాని కొంతప్రజ్ఞ లేకేమి? కోడికి యీకెలలో యేదో యినుపతీగెలతో అల్లినకవచం తొడిగి వున్నదనుకొంటాను. దాన్ని మనలను ముట్టుకోనియ్యాడు.

నాయ : ఏ పిల్లెయితే నేమి. ఎలుకనుబట్టితేసరి, వాణ్ణి నమ్మి మనం పందెం వొడ్డవచ్చునా?

నర : నిరభ్యంతరంగా వొడ్డవచ్చు. బ్రహ్మనాయుడూ. నాయకురాంద్ర మంత్రశక్తికంటె వాడి మంత్రశక్తి ఎక్కువ శక్తిగలదని రుజువవుతుంది.

నాయ : నాయుడు పందేనికి మొగ్గేనా?

నర : నాగమ్మగారి మంత్రశక్తి నాయుణ్ణి మొగ్గించడములోనే వున్నది. మొగ్గుతాడనే నా నమ్మకం.

నాయ : ఎందుకని?

నర : ఆయన కింకా తగినంతసిబ్బంది పోగుగాలేదు. నాయకురాలు రెడ్డిసేనలతో యెప్పుడు వచ్చి మాచర్లమీద పడుతుందో నని భయపడుతున్నాడట. యుద్ధము చేయకుండా నాగమ్మను వోడించేమార్గం యేదయినా కనపడితే తప్పక సంతోషిస్తాడు.

నాయ : ఎంత అతడు సిద్ధముగా వున్నా మనముగా సూచించ బోతే అనుమానపడతాడు. మహాయావలమనిషి. ఏమరు పాటున వొప్పించాలె.

నర : సంక్రాంతి యిక పదిరోజు లున్నది. ఈ యేడు మన కోడిపందేలకు రాడేమో ?

నాయ : అదంతా వట్టిది. సప్తా యేడులోకాలలో యెక్కడ కోడిపందెమని కాకిక బురు వచ్చినా వెళ్లుతాడు. పోకుండా వుండ లేడు. ఒక్క మాచర్లకే ఆహ్వానం పంపితే అను మానిస్తాడు. చుట్టుపట్ల రాజ్యాల కన్నిటికీ ప్రకటన పంపుదాం. దూరపువూళ్ల వాండ్లకు ఆలస్యంగా పంపితే వాండ్లు రారు. ఇక మాచర్ల వారూ మనమే హాజరవుతాము. రాజుగారి సంతకంతో ప్రకటన వంపితే బాగుంటుంది. ప్రకటనకు ముసాయిదా తయారుచేయండి. ఎవరురా అక్కడ ?

నౌకరు : చిత్తం.

నాయ : వ్రాతపరికరాలు తెప్పించు.

[ గుమాస్తా ప్రవేశము ]

నాయ : వ్రాయి.

గు : చిత్తము.

నాయ : (చెప్పుతుంది.)

ఆహ్వానపత్రిక

ఈ యేడు సంక్రాంతి కనుముపండుగరోజున ఏటాజరిగే దానికంటె ఇనుమిక్కిలిగా గురిజాలమైదానములో కోడి

పందెములు జరుగబోతున్నవి. మేటిపందెగాండ్లందరూ పౌరుషముగల పుంజులనుదెచ్చి పందెములు జరిపి దేశములో పౌరుషమును పెంపొందింప గోరుతున్నాము. మానధను లయిన ప్రభువులును, సరదారులును 'కోడిపోరుకంటె గొప్పదిలేదయా' అనే ప్రమాణవాక్యమును సార్థకపరచ గోరుతున్నాము.

ఇట్లు

పల్నాటిప్రభువయిన నలగామరాజు

ఇది చాలునా ?

నర : మగరాజు పల్నాటిప్రభువని సంతకముచేయడము ఎంతో సూచిస్తున్నది.

నాయ : పల్నాటికంతకు తనే ప్రభువునని అభిప్రాయము.

నర : అది కాదనేవారితో కలతకు మొదలన్నమాట.

నాయ : ఈ పందెమే అందుకాయె. సరే, ప్రకటనకు ప్రతులు తయారుచేయించి నలుదిక్కులకు పంపించు.

గు : చిత్తము.

[ వెళ్లుతాడు ]

నర : పందెమేమి యొడ్డుతారు ?

నాయ : ఓడినవారు తమ రాజ్యమును గెలిచినవారి కొప్పగించి పరదేశములకు వెళ్లిపోవడం.

నర : గడువువెళ్లినతరువాత ?

నాయ : తరువాతి సంగ తెవరెరుగుదురు ?

నర : యుద్ధమేనా ?

నాయ : ఈమధ్య గోగ్రహణాలూ, యుద్ధాలూ జరుగకుంటే.

నర : రెండవభారతకథ నడుస్తుంది.

నాయ : పర్వావసానంమాత్రం భేదంగా వుంటుంది. కృష్ణు డిటుంటాడు. నేను కృష్ణపాత్రను ధరిస్తా.

నర : సరే, మనకు జయం నిశ్చయం.

[ లేస్తాడు ]

నాయ : కట్టబోతును గుప్తంగా స్వాధీనములో వుంచండి.

నర : పందేలయ్యేవరకూ కోణ్ణీ, వాణ్ణీ మాయింట్లోనే పదిలం జేస్తా.

నాయ : మీరూ మంత్రకట్టే అంటూవుండండి. బహుమతులు మాత్రం పుష్కలంగా యియ్యండి.

[ నరసింగరాజు నిష్క్రమణం ]

నాయ : [ స్వగతం ]

జూదరితనంగూడ అబ్బింది. ఇది రాజకీయజీవితం. కుట్రలు, కుతంత్రాలు, మారాముళ్లు, ఎన్నో చేయక తప్పదు. నిద్రలేదు, గుండె నిమ్మళంలేదు, కడుపులో చల్ల కదలకుండా దూడలను దువ్వుకుంటూ మానెడు విత్తులు చల్లి గోనెలు పండించుకుంటూ హాయిగా వుండకుండా లేనిపోని బెడద బెట్టుకుంటినేమా అని చివరకు విచారపడవలసివస్తుందేమో. ఆ అమాయికపు ఆవు పశువులు—రచ్చలలో రాటుదేలిన ఈ రాజకీయవేత్తలు—

ఎక్కడి కెక్కడ ? హా స్త్రిమశకాంతరం భేద మున్నది.
అయితే—అట్లావుండు. ఆఁ—భేదమా ? ఉండదుమరీ—
పశువులకూ మనుష్యులకూ భేదముండదూ ? ఆహార
నిద్రాదులలోనేకదా పశుప్రపంచమంతా యిమిడివున్నది ?
మనోవికాసము గలవాడు మానవుడు. మానవజన్మమెత్తి
పశువులవిధంగా జీవించనా ? మంచితనమనగా మట్టితనం
గాదు. జడభరతుని జీవితపద్ధతి నాకు రుచించదు. మానవుడు
మేధావంతుడయినందుకు పశుప్రాయుడుగా జీవించ
గూడదు. పల్నాటిని పీలికలుగా చించి జనులలో
కలహములకూ, కల్లోలములకూ కారణమౌతుంటే, ఋషి
సాంప్రదాయములన్నీ ధ్వంసం జేసి సంఘమును సంకరం
జేస్తుంటే, పశువులాగ చూస్తూ వూరుకోనా ? మూఢ
జనులవలె బాధలు సహిస్తూ పడివుండనా ? నాయం
దీశ్వరశక్తి ప్రస్ఫుటమై వున్నది. మంత్రశక్తికి కొదవలేదు.
ఉత్సాహశక్తి యీ మహదారంభమునకు పురికొల్పినది.
చతురుపాయముల నుపయోగించి యీ కార్యమును
సాధించితీరుతాను.

జూదము పనికిరాదా ? రాజు చతురంగబలసమేతుడై
యుద్ధము చేయవచ్చునుగదా ? గుఱ్ఱములకూ, ఏనుగులకూ
నే కోళ్ళను కలుపుతాను. ఏనుగులు పోరి రాజ్యాలు సంపా
దించంగాలేనిది కోళ్లుపోరి సంపాదిస్తే తప్పు వచ్చిందా ?

కార్యమువల్ల కాకపోతే ఖడ్గము నుపయోగిస్తాను.
పల్నాటి నుద్ధరిస్తాను. ఇప్పటికీ యెత్తు వేసి చూస్తాను.

[ నిష్క్రమణం ]

3వ - రంగము

మాచర్ల - కచేరిసావడి

[ మలిదేవరాజు, బ్రహ్మనాయుడు మొదలగువారు ప్రవేశము ]

బ్రహ్మ : చూచారుగదా ఆహ్వానపత్రిక. ఈయేడు కనుము పండుగ చాలా ఖులాసాగా వెళ్ళిపోతుంది. ప్రకటన ఒక్క పల్నాటికేకాదు. నాయకురా లిది చాలా మంచిపని జేసింది. చుట్టుపట్ల రాజులంతా మూగుతా రనుకొంటాను. అయితే పాపం వాండ్లకు వ్యవధి చాలదు. దేశంలో పందే లంటే యింకా సరదా పుట్టలే. కొత్తగా యిప్పుడు దేవులాడబోతే వట్టి అలికికోళ్లు దొరుకుతవి. జాతికోళ్లు దొరకవు. నాకు వారంరోజులు గడువిస్తేచాలు. ఏరకం గావలెనంటే అవి తయారుచేస్తాను. నా కో ళ్లెప్పుడూ తయారు తింటూనేవుంటని. ఇదంతా యెందుకు—వచ్చే సంవత్సరం మాచర్లలోనే పందేలు జరుపుదాం. మనకీర్తి చుట్టుపట్లంతా వ్యాపిస్తుంది. బాలుడూ, రేపు పందేనికి నీవు కోళ్ళను యేర్చి యేర్పాటుచెయ్యి.

బా. చం : మా ముఠాలోనే వున్నవి. లోకాన్నంతా జయించ గల కోళ్ళు.

బ్రహ్మ : ప్రయాణం రేపుకద్దనంగా బంట్లనన్నింటినీ ఒక్కచోట చేర్పించు. తనఖీకి వస్తా ఒక్కసారి కంటితో చూచానాఅంటే కోడిచార చెప్పివేస్తా.

శొమ్మ : నాయుడుగారూ, నా దొక మనవి. ఈ వ్యసనం కూడనిది. మనం ఆజోలి పోవద్దని నా అభిప్రాయం. ప్రస్తుత స్థితులలో పచ్చిగడ్డివేస్తే మండేటట్లుగా వున్నది. ఉభయులకు కలహాలు పెరుగుతవి. మనము ఆపలేము.

బ్రహ్మ: తమరు అనవసరంగా భయపడుతున్నారు. ఇవి మన వాండ్లలో పౌరుషం పూర్తిగా పెంచవలసిన రోజులు. కోడి పందేలే వీరులను తయారుచేసే గురుకులాలు.

మ. దే. రా: నిశ్చయం. కోడిపందేలే లేకపోతే యింతమంది వీరులు మనవైపు లేకనేపోదురు.

అ. రా: మానాన్నగారు చెప్పినదే వాస్తవం. దీనిమూలంగా కలహాలు పెరిగితీరుతవి. అలగాజనం చెప్పినట్టురారు. గిల్లి కజ్జాలు పెట్టుకుంటారు.

బ్రహ్మ: నలగామరాజుగారికి పందెములంటే చాలాయిష్టం. ఏది వొద్దుదామన్నా సరేనంటారు. విరోధాలకు బదులు యిటువంటి సమావేశములవల్ల యితరరాజులతోగూడ సఖ్యం కుదుర్చుకోవచ్చు.

మనం ప్రస్తుతం సిబ్బందితక్కువవాండ్లం. పందేలలో సరదాగల రాజులందరినీ మనవైపుకు లాగగలను. ఇది మన చేతులలోవున్న బలమయిన సాధనం. దాన్ని వుపయోగించడమే నీతి. మన అదృష్టం బాగావుంటే యేది యెట్లా జరుగుతుందో చెప్పలేము.

మ. దే. రా: నిశ్చయం

అ. రా: మాకు న్యాయమని తోచింది చెప్పాం.

కొమ్మ: తమ చిత్తప్రకారం కానియ్యండి.

బ్రహ్మ: ప్రభువుగారి అభిప్రాయమేమి?

మ. దే. రా: తప్పక మనం పరివారసహితంగా పోయి పందెం పెట్టవలసిందనే. వెనుకడుగు వద్దు.

అందరు: చిత్తం.

## ౩-వ రంగము

### గురిజాలదగ్గర మైదానం

[ బాలుడు, కన్నమనీడు ప్రవేశము ]

[ కోళ్లపందెం తెరలోపల జరుగుతుంది ]

బాలుడు : నాన్నగారు వచ్చేవేళయింది. తాగడం ఆపి వేయించు. కత్తులన్నీ చికిలిచేశారా?

కన్న : కత్తు లెందుకు? నా నెవిలి ఆరెదెబ్బతోనే నాయకురాలి పుంజులను పడుకోబెడుతుంది.

బా. చం : అటువంటి పనులు జెయ్యకు. వట్టిపందేలు గావు.

కన్న : వూరికే తమాషాకన్నా. ఇదుగోనోయి, ఇక కోళ్లకు దాణా వెయ్యకండి. కాస్త ఆకలితో వుంటేనేగాని రోష మెక్కదు. నీళ్లుబెట్టి వరుసగా పందిట్లో కట్టి వేయండి.

[ మలిదేవరాజు, బ్రహ్మనాయుడు ఇతరులు ప్రవేశము ]

బ్రహ్మ : బాలచంద్రా! అంతా సిద్ధంగా వున్నదా?

బా. చం : మనవాండ్రమంతా వచ్చాము. గురిజాలవారు ఇప్పుడే ఒకరొకరు చేరబారుతున్నారు. నరసింగరాజుగారు వచ్చారు. పై రాజ్యాలవాండ్ల పొళుకు వెక్కడా కనబడదు. అంతా చప్పగా వుందిగాని యెక్కడా ఉత్సాహాం కనబడదు.

బ్రహ్మ : ఆవైపుకల్లా నరసింగరాజే సర్దాగల మనిషి. కొంత వరకు రాజుగూడా నయమే. ఇక పైరాజ్యాల సంగతి చెప్పనే అవసరంలేదు.

మ. దే. రా: పై వాండ్లకు కాలవ్యవధిగూడా చాలదులే. వడ సారం వారంరోజులయినా లేకపోయె. ఇటువంటి పందేలలో నిలువబడవలెనంటే కోళ్ళకు యెంతశిక్షణ వుండాలె! నేను పదిహేను రోజులయినా యీదించంది కోడిని పందేనికి బెట్టను. వట్టివాటినిబెట్టి పేరుచెడకొట్టుకోవడం దప్ప యేమీ లాభం వుండదు.

బా. చం: చూస్తారా మన కోళ్ళను?

బ్రహ్మ: పదండి. దాని చెరుపేముంది? మళ్ళీజూతాము. నా తనిఖీకి ఆగని కోడిని యెప్పుడూ పందేనికి బెట్టను. నాకు నచ్చిన కోడి యెప్పుడూ కోసబోదు.

మ. దే. రా: అనుభవం.

బ్రహ్మ: కేవలం అనుభవమే కాదు.

మ. దే. రా: మెళకువగూడానూ. అరుగో! రాజుగారూ, నాయకురాలూ వస్తున్నారు.

బ్రహ్మ: కాస్త హెచ్చుతగ్గుగా వేళకే వచ్చారు.

కన్న: మనము అగ్గిపడకముందే ఆరంభించాలె.

బ్రహ్మ: మన ఆలస్యమేమున్నది? వారు సరే ననంగనే ప్రారంభింతాము.

[ నాయకురాలు ప్రవేశము ]

[ రంగస్థలములో గురిజాలవారు ఒక భాగములో కూర్చుంటారు ]

నాయ: మనవాండ్లంతా వచ్చారా? మాచర్లవారంతా తయారుగా వున్నట్లున్నదే? మాదెప్పుడూ తేమానమే. ఇంకానయం, నరసింగరాజుగారు పూనుకోబట్టి యిప్పటి కయినా తెమిలాం. అయ్యా, బ్రహ్మనాయుడుగారూ!

యితరదేశాలవారు యెవరూ వచ్చినట్టులేదే? యేమి చేతా మంటారు ?

బ్రహ్మ : వాండ్లకు దీనియందు శ్రద్ధతక్కువ. వచ్చిన మనమే కానిత్తాము.

నాయ : ఇతరదేశాలదాకా యెందుకు, మాకున్నదీ మీకున్న శ్రద్ధ ?

బ్రహ్మ : బయటివాండ్లకు సకాలంలో తెలిసినట్టులేదు. రెండునెలలయినా ముందుగా ఆహ్వానా లందితే, వెసులుబాటు చూసుకోని వస్తారు.

నాయ : దీనియందు రుచికలిగిందాకానే తరువాత వద్దన్నా వూరుకోరు. కొంతకాలం దీనిభారం మీమీద బెట్టుకోని జరపండి.

బ్రహ : అట్లాగే. వచ్చేసంవత్సరం ఆహ్వానాల యేర్పాటంతానే జేస్తాను. ఇక్కడే జరుపుదాం.

నాయ : యెక్కడ జరిపితేనేమి ? మాచెర్లలో జరిపినా నాకిష్టమే ; అదిమాత్రము మనదిగాదా ?

[ రహస్యంగా ]

మ. దే. రా : చూచారా. ఈ ఆటలవల్ల యెట్లా స్నేహం గుదురుతున్నదో.

బ్రహ్మ : ఈ మాటే నేను నిన్నంటే కొమ్మరాజుగా రంగీకరించారుగారు.

కొమ్మ : నాయుడుగారూ, తమరేమయినా జెప్పండి. ఆమె మాటలలో స్నేహమేమీ గనపడడం లేదు. మాచర్ల "మనదం" టున్నది.

బ్రహ్మ : దూరపుచూపు మంచిదేగాని తమకు అనుమాన మెక్కువ.

కొమ్మ : మనము చెడతాం.

బ్రహ్మ : నమ్మక చెడడంకంటే నమ్మి చెడడం మంచిది.

అ. రా : ఎట్లాజెడ్డా పర్యవసానం వొకటే.

[ ఒక సుద్దులవాడు ప్రవేశము ]

పాట

ఋ. క : పల్నాటిమిద్దెలకు - వాసాలు లేవు
కొండవీటిబ్రాహ్మలకు - మీసాలు లేవు
మాచర్లకోళ్లకు - రోసాలు లేవో - తంధాన

[ వెళ్లిపోతాడు ]

బా. చం : ఎవడురా వాడు? చూపిస్తాం వుండు, మాచర్ల కోళ్లకు రోసాలు వున్నదీ, లేనిదీ.

నర : మీరూ చూతురుగాని.

క. దా : అవును, వుభయులము చూస్తాం. తినబోతూ రుచడగడ మెందుకు?

[ సుద్దులవాడు తిరిగి ప్రవేశము ]

ఋ. క : మాచర్లదొరలకు - వేసాలు లేవు
అజ్ఞానచేష్టలకు - దోసాలు లేవు
పల్నాటిరెడ్లకు - మీసాలు లేవో - తంధాన.

[ వెళ్లిపోతాడు ]

కేతు : అవురా! బ్రహ్మనాయుడు నీచేత యిట్లా కూయిస్తు న్నాడా? పల్నాటిరెడ్లకు మీసాలు లేవుగా?

నాయ : అయ్యా, మీరెందుకు తొందరపడతారు. అవసరము వచ్చినప్పుడు చూపింతురుగాని.

కొమ్మ : ఇదియేమో పెద్ద పన్నుగడగా వున్నది.

నర : ఎవడివో వెఱ్ఱిమాటలకు మీ రుభయులూ కోపించడం బాగాలేదు.

కేతు : రెడ్డిశాస్త్రం వెలమశాస్త్రానికి తీసిపోయేదిగాదు.

బా. చం : పారంపర్యంగా వచ్చే వెలమశాస్త్రం యెండాకాలంలో వచ్చే రెడ్లయొక్క చొప్పకట్టశాస్త్రంక్రింద ఆగుతుందా?

కేతు : రెడ్డికత్తులు వెలమకుత్తుకలకు ప్రయోగించినప్పుడు తెలుస్తుంది.

బా. చం : రెడ్లకత్తులు చొప్పకట్టలు బాగా నరుకుతవి.

బ్రహ్మ : అయ్యా, మనము విలాసంగా పండుగ గడుపుకోడానికి వచ్చాం. మీ వాక్కలహాలుచాలించి పందేలు ప్రారంభించండి. మధ్యవర్తిని యెన్నుకొందాము.

నర : ఉభయులకు కావలసినవాడూ, న్యాయస్తుడూ, అలరాజే దీనికి తగినవాడు.

బ్రహ్మ : మాకూ యిష్టమే.

అ. రా : నాన్నగారూ! యిది యేదో యెత్తుగా తోస్తున్నది.

కొమ్మ : ఏమన్నాగానియ్యి. అంగీకరించి న్యాయం జెప్పు. ఉభయులూ కోరినప్పుడు కాదనడం తప్పుమాట.

అ. రా : అంగీకరించాను. మీ ఉభయులు చెరొక ప్రతినిధిని నిర్ణయించుకొని వారిద్వారా పుంజులను వదలండి.

నల. రా : మా తరఫున నాగమ్మగారు. ఆమె చర్యల కన్నిటికీ నే బద్ధుణ్ణి.

మ. దే. రా : మా తరపున బ్రహ్మనాయుడుగారు, వారి చర్యలకు నేనూ బద్ధుడనే.

నాయ : నరసింగరాజుగారూ. మొదట అచ్చకాకిడేగను వదలండి.

బ్రహ్మ : మంచిదానిని రేస్తారు. నలుపులో కాకిని మించింది. కన్నడూ, మనం వింజాబెరసను వదలుదామా ?

కన్న : వద్దు. అసలు బెరసనే వదలుదాం.

బ్రహ్మ : సరే.

నాయ : ఎంత అందంగా వుందీ ! కండ్లు తెల్లగా బేడబిళ్లలలాగున్నవి. మా నెవలికి దీటుగాదు. అయినా చూతాం.

నల. రా : రెండూ పోరుతుంటే కర్ణార్జునుల ద్వంద్వయుద్ధంలాగున్నది.

మ. దే. రా : ఒక తన్నుకే డేగకు బోర బద్దలుగా చీలింది.

నాయ : చీలినా మెడపట్టు వదిలించేమో చూడండీ. ఆ పట్టులో బెరస పడవచ్చు.

బ్రహ్మ : ఫయిసల్, మెడమీది దెబ్బతో డేగ పడిపోయింది.

అ. రా : నాగమ్మగారూ ! ఇంకొకదాన్ని వదలుతారా ?

నాయ : రాజుగారూ ! పూరికోళ్లలో బడిరకం చూసి వదలండి.

మ. దే. రా : (రహస్యంగా) సరుకు ఖాళీ అయినట్టున్నది. పూరికోళ్లలోకి దిగింది.

బ్రహ్మ : వినేను ; చిన్నగా మాట్లాడండి. బెరసక్రింద పూరికోడి ఆగలేదు. అయిదు నిమిషాలుకూడా పట్టదు

బా. చం : అయింది. పూరికోడి పూరిమేసింది. ఇంకొకదాన్ని తియ్యండి.

బ్రహ్మ : పడిపోయినా వదలదు చూడు. పూరికోళ్లలో మెరుగయిందే, బెరసకు ఆగలేకపోయిందిగాని.

నాయ : బెరసలు మాదగ్గర లేవు. వింజాబెరసను వదలి చూస్తాం.

బా. చం : ఇది తొలిముద్దకే పోతుంది. వియ్యమయినా కయ్యమయినా సరిదీట్లతో చెయ్యాలె.

నల. రా : వింజాబెరస అంత తీసివేసిందేనా ?

బా. చం : ఎంతోనా ? చూడండి. అది మొగిసి ముందుకు రాందే ?

నల. రా : రాకేమి ? కమరబడ్డది.

బా. చం : అదుగో ! ఒక్కతన్నుకే తెల్లయీాకె వేసింది. అరరే ! పరుగెత్తిపోతున్నది.

[ బ్రహ్మనాయుడుపక్షమువారు నవ్వుతారు ]

మ. దే. రా : నాగమ్మగారూ ! కోసకోళ్లనుగూడా పందేలకు పెట్టిస్తున్నారేమి ? మీవైపున దీటయిన పుంజులు లేకపోతే చెప్పండి ; మేము పెట్టలను వదలుతాము.

నాయ : పుంజులు వోడిపోయి పెట్టలే గెలుస్తవేమో, ఎవరు చూచారు ? నరసింగరాజుగారూ, ఈసారి నెవలిని వదలండి.

బ్రహ్మ : ఇది చూపులకు బాగానే వున్నది. వరియెన్నులాగ తోకానూ అదీనీ.

నాయ : దీనితో మీ బెరస ఫయిసల్.

బా. చం : నెవలి బెరసను కొట్టటానికి యిదే మొదలు. మీకంత బరవాసావుంటే ఎంతపందెం వొడ్డుతారో చెప్పండి.

నల. రా : నే వోడితే రాజ్యం మీకు వదిలి యేడేండ్లు దేశ త్యాగంజేసి సపరివారంగా ప్రవాసం చేస్తాను.

మ. దే. రా : నే వోడినా అదే పందెం. గెలిస్తే పల్నాటి ఏకచ్ఛత్రాధిపత్యంజేస్తా. వోడితే నా మొదటిస్థితికి నే వస్తా.

బ్రహ్మ : నాగమ్మగారూ, సరేనా ?

నాయ : మీరేమంటారో చెప్పలేదే ?

బ్రహ్మ : ఏమయినా సరే, అన్నమాటకు వెనుకకుపోయేది లేదు.

నాయ : (నలగామరాజుతో ఆలోచించి) యేమయినా సరే, మేమూ వెనుకకుబోము.

కొమ్మ : ఇది యేదో విలయానికి వచ్చింది. యీ పందెం కూడదు.

అ. రా : నేను ఉభయులనూ ప్రార్థిస్తాను. ఇంకొక పందెం పెట్టుకోండి. ఎవరు వోడినా కష్టమే, అయినవాండ్లలో పని.

మ. దే. రా : (బ్రహ్మనాయుడితో) వీండ్లు ప్రతిదానికి అడ్డం వస్తున్నారు. తమరు లేచి గట్టిగా జెప్పండి.

బ్రహ్మ : (లేచి) కొమ్మరాజుగారు చెప్పినది వాస్తవమయినా ఉభయరాజులూ, మంత్రులూ కలిసి పందెం వొడ్డి వెనుక దీయడం అక్రమం.

నాయ : నన్నూ అదే బాధిస్తున్నది.

మ. దే. రా : ఏమయినా కానియ్యండి, నేను వెనుకడుగు వేయను.

నల. రా: నేనుమాత్రం వెనుకకు తగ్గుతానా?

మ. దే. రా: [బ్రహ్మనాయుడితో రహస్యంగా] మా అన్న మాట మిగలా అన్నందుకు పండ్లబిగువున మాట్లాడు తున్నాడు గాని సందిస్తే వెనుకకు లాగుతాడు.

బ్రహ్మ: వదలండి కోళ్లను.

నాయ: కోళ్లు మన పందెంయొక్క విలువ తెలిసి పోట్లాడు తున్నట్లు కనుబడుతున్నది.

శా. చం: తొలింబ్రంలోనే బెరస జుట్టు పట్టుకొని అయిదు తన్నులు తన్నింది.

బ్రహ్మ: అరే! అయిదూ తప్పించుకున్నదే! వజ్రదేహంలా గున్నది.

నాయ: అదుగో! ఫయిసల్; బెరసకు మెడ సగం తెగింది. కోడిమెడ బడ్డది.

బ్రహ్మ: బెరస పడిపోయింది.

శా. చం: తెప్పిరిల్లి లేస్తుందేమో ఆగండి.

నాయ: పెద్దనిద్రే; నరసింగరాజుగారూ, నెవలిని ఆపండి.

నల. రా: మాచర్ల మాది.

[కోలాహాలం]

నాయ: ఎప్పుడూ మీదే. నడుమ రజ్జుసర్పభ్రాంతయింది.

నల. రా: బ్రహ్మనాయుడుగారూ, మీ రిక మాచర్ల పోవడ మెందుకు? యిక్కడనుంచే ప్రయాణం గట్టండి.

మ. దే. రా: అరే. చివరకు యిట్లయిందేం?

అ. రా : ఇంకొక విధంగా అవుతుందని నేననుకోలేదు. మొదట చెపితే వినకపోయినారు. యిప్పటికయినా యేదో విధంగా రాజీగా ఫయిసల్ చేసుకోండి.

నాయ : మీరు చెప్పే రాజీమాట అంతా బతికి బాగుంటే యేడుసంవత్సరాలు ముగిసినతరువాత ఆలోచింతాము. ఈ మధ్యగాదు.

మ. దే. రా : రాజ్యం వచ్చింది ; పోయింది.

బ్రహ్మ : మాచర్ల వెళ్లి బంధువులను దీసుకొని వెళ్లుతాం.

నల. గా : మూడురోజులు గడువు, తరువాత ఒక్క నిమిషం వుండవద్దు.

[ బ్రహ్మనాయుడు మొదలగువారు నిష్క్రమణం, తెరపడుతుంది ]

## ౪-వ అంకము

[ ప్రవేశము - ప్రతాపుడు ]

పోరడమంటే కత్తులతో పోరాటమేగాదు. కత్తులూ ఫిరంగులూకూడా సమకూర్చలేని విజయం సత్యవ్రతం సమకూర్చుతుంది. దీనిది క్రౌర్యంలేని ప్రతాపం. అహింస దీనికి వేరు. ఇతరులు హింసించినా నిరోధించక సహించడం వృక్షం. ప్రేమ దీని ఫలం. ఈ పోరాటంలో శత్రుత్వసంహారమేగాని శత్రుసంహారం లేదు. ఇటువంటిపోరు నాకు చాలా యిష్టం.

### ౧-వ రంగము

మాచర్ల - రాజుగారి గృహం

[మ. దే. రా. బ్ర నా; బాలుడు; కొమ్మరాజు మొ. వారు ప్రవేశము]

బ్రహ్మ : తా నొకటి తలంచితే దైవమొకటి తలంచాడన్నట్టయింది.

మ. దే. రా : కాదు, కాదు, మన మొకటి తలంచితే నాగమ్మ మరొకటి తలంచింది. అంతా మాయగారడీ మోస్తరయింది. బెరస నెవలికి లొంగిపోవడమే ఆశ్చర్యం.

బా. చం : బెరస రంగంలో నిలుచుంటే అభిమన్యుడు పద్మవ్యూహంలో పోరుతున్నట్లున్నది. దాని అయిదు తన్నులూ అశ్వినజారిపోయినవి. చిత్రంగా కొంకి మెడకు తగులుకొన్నది. మునివేళ్ల కందుతున్న గురిజాలరాజ్యం యెగిసి

పోగా, కాళ్లక్రిందవున్న మాచర్ల కూడా బెసికిపోయింది. రెంటికీ జెడ్డ రేవడల మయినాం.

బ్రహ్మ: విజయం రొంపిలో స్తంభం. ఎటు వొరుగుతుందో చివరవరకూ చెప్పలేము. ఒకడు యెల చేతికందినట్టే భావించి చెయి చాచుతాడు. జయలక్ష్మి వాణ్ణి కసిరికొట్టి మఱివొకడికి చేయి అందిస్తుంది. ఒకడు చెట్టు యిండె బెట్టి నరికి ఒకవైపుకు లాగుతాడు. అది మఱివొక వైపుకు విరుసుకొని యిండ్లను భగ్నము చేస్తుంది. న్యాయాధిపతి విచారణ పూర్తిజేసి ఒకవైపు అభిప్రాయం తెల్పుకొంటాడు. కాని యే స్వల్పఅనుమానమో తగిలి కథ అడ్డంగా తిరుగుతుంది. విరగబండి కోసి ఆరవేసిన వనలు చేలమీద పరవంజివుంటవి. ఈనగాచి నక్కలపాలు జేసినట్లు ఒక్క వానతో అంతా ముగుస్తుంది. విధియొక్క చెయ్దిము లిట్టివని చెప్పవీలులేదు. విజయకారణము ధనం గాని, దేహబలంగాని, సైన్యబాహుళ్యంగాని, ఆఖరుకు బుద్ధిబలంగాని కాదు. అదృష్టమే కారణము.

కొమ్మ: గాలిలో దీపంబెట్టి దేవుడా నీ మహిమంటే యేమి ప్రయోజనం. తెలిసి తెలిసి చేతులమీదుగా రాజ్యం పోగొట్టుకొన్నాం. అతిసంచయేచ్ఛ తగదు. కలిగిన దానితో తృప్తిజెందివున్నట్టయితే యింతముప్పు వాటిల్లక పోయేది.

బ్రహ్మ: గెలుపోటము లెవరికీ ముందుగా దెలియవు. గెలువ గలమను ఆశ లేనిది యెవడూ యేపనీ తలపెట్టడు. ఆశయే ఆరంభముల కన్నిటికీ మూలము. సంశయములకు లోనయ్యేవాడు యేపనీ నిర్వహించలేడు. సాహసము

లోనే జయమున్నది. సాహసమే వీరలక్షణము. సాహసునకు శంకితుడు పరిపంథివర్గములోనివాడు. వెనుకకు లాగడం శంకితుని పని. ముందడుగు వేసేవాడు సాహసుడు.

అలరాజు : గతజలసేతుబంధన మెందుకు? ముందు జరుగ వలసిన పనేదో తేల్చండి.

బా. చం : బాలుణ్ణి; సాహసించి చెప్పినందుకు క్షమించండి. మనము మాచర్లను విడువక మండలమును సంరక్షించు కొందాము. కల్లజూదములో పోగొట్టుకొన్నది కత్తితో గెలుచుకొందాము. మాచర్లను మొదట అక్రమంగా తీసుకొన్నామనే అపవాదుకూడా పోతుంది.

కొమ్మ : దండోపాయాని కిప్పటికంటె మంచిసమయము రాదు. మాచర్లను విడిచిపోయి యెప్పుడో మళ్ళీవచ్చి యుద్ధం జేయడం నేలవిడిచి సాము చేయడం. అయితే యిప్పుడు యుద్ధంజేసినా గెలుస్తామన్న ధైర్యం నాకు లేదు.

బ్రహ్మ : మనము చేసేపని ముందు మన మనస్సుకు న్యాయంగా దోచాలె. దేవుడూ, లోకమూ మెచ్చేటట్లుగా వుండాలె. మనం జేసిన ప్రతిజ్ఞకు వ్యతిరేకంగా పోతే సత్యదూరుల మవుతాము. సత్యవ్రతంతో సమానమయింది లేదు.

బా. చం : మనది క్షత్రియధర్మం. రాజ్యం వీరు లనుభవించ దగినదిగాని సత్యవ్రతం బట్టే సన్యాసులకు చేజిక్కేది గాదు. మనం పోరలేమని తోస్తే యెప్పుడో తిరిగివచ్చి పోరాడుదా మని భ్రమపెట్టుకొని ప్రవాసకష్టాల పాలుగావడంకంటె రాజ్యం మన కక్కరలేదని యిప్పుడే చెప్పివేస్తే నాగమ్మే యింత పాల మిప్పిస్తుంది. దున్నుకొని బ్రతుకుదాం.

బ్రహ్మ : ధర్మరక్షణకోసం శత్రువును హింసించడమూ, అది సాధ్యంగాకపోతే ధర్మమువిడిచి పారిపోవడమూ రెండూ సత్యమునకు దూరమయినవే. ఆ రెంటిలో పారిపోవడం కంటె హింసించడమే మేలు.

బా. చం : మీరు పల్నాటిని విడిచి బయట అడుగుబెట్టిన మర్నాటినుంచీ శత్రుశేషం పనికిరాదని నాగమ్మ మన వెంటబడి వేధించి నాశనం జేస్తుంది.

బ్రహ్మ : మనం హింసామార్గ మవలంబించి ప్రతిక్రియకు పూనుకొన్నామా, నశించడమే నిశ్చయం. అహింసా వ్రత మవలంబించి శత్రువును నిరోధించకుండా సత్యమును కాపాడితే నశించం. తప్పకుండా బలవంతుల మౌతాము. ధర్మబలమే బలము.

బా. చం : ఏబాధలు పెట్టినా సత్యానికి నిలువబడడం బ్రాహ్మణధర్మంగాని క్షత్రియధర్మం గాదు.

బ్రహ్మ : బ్రాహ్మణజన్మమెత్తకపోయినా సర్వోత్కృష్టమయిన సత్యవ్రతం యెవరయినా అవలంబించవచ్చు.

బా. చం : ఏడుసంవత్సరములు ప్రవాసములో నవిసినతరువాత మీరు యుద్ధ మసలే చేయలేరు. ఇప్పటి బలగముకూడా జారిపోతుంది.

కొమ్మ : నాయుడుగారూ! నాకు తెలియ కడుగుతాను, అవసరమయితే యిప్పుడుగాని, మఱొకప్పుడుగాని మాచర్ల కోసం మీరు పోట్లాడ దలచారా ?

అ. రా : సమయం నెరవేర్చి వచ్చినతరువాత పోరే అవసరం లేకపోవచ్చు.

బ్రహ్మ : ఈ యేడుసంవత్సరములూ యెవ రెన్ని బాధలు పెట్టినా సహించి సమయం నెరవేర్చినట్లైతే శత్రువుల హృదయం మారిపోయి ఉభయులకూ శత్రుభావం నశించి మిత్రభావమే కలుగవచ్చు. కలుగకపోతే రణం నిశ్చయం.

బా. చం : నా నిశ్చితాభిప్రాయ మిది. గడు వయినతరువాత వారు మీకు రాజ్య మెటూ యియ్యరు. అప్పుడు మీరు యుద్ధంజేసి గెలవడం వట్టిమాట. యేడుసంవత్సరములూ బాధలుపడి తరువాత చావడంకంటె విజయమో, మరణమో యిప్పుడే తేల్చుకోవడం మంచిది.

బ్రహ్మ : మనకు ఇప్పుడో అప్పుడో మరణమే నిశ్చయమైన యెడల మన మిచ్చినమాట చెల్లించి తరువాత మనకు న్యాయంగా రావలసినదానికోసం పోరి వీరస్వర్గమందడం మేలు.

మ. దే. రా : గురువుగారు నిశ్చయించినదే సజావైన దారి. దానిని మనమందరం శిరసావహించవలసినది.

కొమ్మ : తథాస్తు.

అందరు : తథాస్తు.

బ్రహ్మ : కొమ్మరాజుగారూ, వారి కొమారుడూ మనతో వనవాసం జేయవలసిన ప్రసక్తి లేదు. గురిజాలకు వెళ్లడమే ఉత్తమమని నాకు తోస్తున్నది.

కొమ్మ : సుఖకాలములో మీ ఆశ్రయమును బొంది, కష్ట కాలములో వైదొలగడం నాకు సమ్మతంగాదు.

అ. రా : ఉత్తమమయిన జవాబు.

బ్రహ్మ : ఇక మనము వెళ్లవలసిన స్థలము నిర్దేశం చేయవలసి వున్నది.

మ. దే. రా : తమరే నిశ్చయించండి.

బ్రహ్మ : మండాది విశాలమయిన ఊరు. కృష్ణ అడ్డమున్నది. పశువులకు నీరూ మేతా సమృద్ధిగా దొరికే అడవులు అందికెలో వున్నవి.

లంకన్న : మన కిప్పుడు పశుధనమే ఆధారం. మండాది పశువుల పెంపుకు ఒనరయిన ఊరు. మెకాలపోడుగూడా తక్కువ.

మ. దే. రా : మండాది పోవడం అందరికీ యిష్టమేనా?

కొమ్మ : పోయి వుంటుంటే సాధక బాధకాలు తెలుస్తవి. వసతిగుదరకపోతే ఇంకోకవూ రవుతుంది.

బ్రహ్మ : రేపు ప్రొద్దునే ప్రయాణం. ఎల్లుండి తెల్లవారుగట్ల పల్నాటియెల్ల కట్టదాటి పోతాము.

ఆహా ఎంతమాట! మనము పల్నాటిని విడిచిపోతున్నామా! తల్లీ పల్నాటిరాజ్యలక్ష్మి! ఇక యేడేండ్లు నీ నీళ్లు రుణస్య దీరనవి. పవిత్రమయిన యీ పల్నాటి పుణ్యభూమిమీద పరుండేభాగ్యం మనకు లేదు. మనకు చంద్రవంక నీళ్ళలో పర్వస్నానం ప్రాప్తం దీరింది. పచ్చిక దుబ్బులవలె పెరిగిన యీ పల్నాటికొండలు మన కిక కనుపడవు. పల్నాటిభానుడు మనమీద అస్తమించబోతున్నాడు. తల్లీ ని న్నొకవరముమాత్రము కోరుతున్నాము. నీ ఉత్సంగములో పతనమై కండ్లు దెరిచాము. తిరిగి నీ వొళ్లోనే క్రిందకొరిగి మాగన్నుబెట్టే భాగ్యముమాత్రం మా కియ్యి. అదియే ముల్లోకరాజ్యంపెట్టు.

[ తెరపడుతుంది. ]

## ౨ - వ రంగము

### గురిజాల - రాజమందిరము

[ నలగామరాజు, నాగమ్మ, నరసింగరాజు ప్రవేశము ]

నల. రా : ఇప్పటి కొకవిధంగా గట్టెక్కినట్టే. పల్నాటిని బాధించుతున్న అంతఃశత్రువులను సరిహద్దుల వెలుపలికి తరిమాం. బయటిశత్రువులకంటె లోపలిశత్రువులు ఎక్కువ అపాయకారు లనేది దేహములోని శత్రువులకూ, దేశము లోని శత్రువులకూ కూడా వర్తిస్తుంది. మా కుటుంబము యొక్క ప్రాపున తరములనుండి యెల్లవిధముల పేరు ప్రతిష్ఠల బొంది, అదంతా మరచి, చివరకు కుటుంబకలహ ములు బెంచి, తా నే యేడుగడని నమ్మికొనివున్న మమ్మును మోసగించి, బెదరించి, రాజ్య మపహరించిన బ్రహ్మనాయుని కృతఘ్నత జ్ఞాపకమునకు వచ్చినప్పుడల్లా విచారం గలుగు తుంది. కాని యితరులకు చెప్పడం సులభం, తాను చేయడం కష్టం. మాకు పరోపకారులయినవారియెడల మేమయినా కృతజ్ఞులమై వుంటే చాలు. మిక్కిలి కావలసిన వాండ్లు సహితం శత్రువులలో గలిసిపోయి, చిక్కులలో మునిగివున్న మాకు కొండవలె అండయి నిలిచి బృహస్పతిని మించిన తన మేధాసంపత్తిచేత దేశమును, మమ్మును ఉద్ధరించిన నాగమ్మగారిని కలకాలము మరువకుందుము గాక !

నాయ : దైవసేవ, దేశసేవ, రాజసేవ—మూడూ కలిసివున్న యీ మహాత్కార్యవిషయమున నే జేసిన అల్పసేవను ఏలినవా రింతగా ప్రశంసింప పనిలేదు. నా ధర్మం

నే నెరవేర్చాను. ఇది నాకూ తరణోపాయమే. నా కిట్టి వీలును నే కోరకుండానే కలిగించినందుకు తమకు నే నెంతయు కృతజ్ఞురాలనై వుండవలసివున్నది.

నల. రా: ఈ అవకాశమును మేము గలిగించడమేమి? మీ అర్హతే మీకు ఒనగూర్చింది.

నాయ: యోగ్యతనుబట్టి యోచించేయెడల మానవుడు దేనికీ అర్హుడుగాడు. పరమేశ్వరుని కృపచేతనే మన కన్నీ ప్రసాదింపబడుతున్నవి. మన ప్రయత్న మూరక నిమిత్త మాత్రమే.

నల. రా: భగవంతుడు మిమ్మి నొకసాధనంగా వుపయోగించ దగినట్టు భావించడమే మీ అర్హతను తెలియజేస్తున్నది.

నాయ: కార్యసాఫల్యమునకు దైవ పురుషకారముల రెంటి యొక్కయు ఆవశ్యకతను బహుసమర్థతతో నిరూపించారు.

నర: తమ రింతవరకు మాట్లాడినదంతా గతముయొక్క ప్రశంస. ఇకముందు జరుగవలసినదానిలో దైవము సంగతి అటుండ నిచ్చి, మీ రిద్దరు చేయవలసిన పురుషకారముమాత్ర మెక్కు వగా వున్నది. పురుషప్రయత్నము ఫలించడమూ, ఫలించక పోవడమూ గలదుగాని, యిప్పుడో, యెప్పుడో చేసినకర్మలకు ఫలమియ్యడందప్ప పరమశివుడుగాని పరకేశవుడుగాని యేమీ ఊరక ప్రసాదించినట్టు నే వినలేదు. దీనిని తమరు బౌద్ధవాద మంటారుగామాలె.

నల. గా: అభిప్రాయ భేదములున్నా మాకూ తమ్ముడికీ ఆచరణలో భేద మెప్పుడూ కలుగలేదు. మా తమ్ముని ఉపదేశములను యిదివరకు వినక చెడిపోయినాముగాని విని చెడిపోయినది లేదు. నీ సలహాను వినగోరుతాను.

నర : శత్రువులు మాచర్లను విడువకపూర్వం అచ్చట జరిగిన ఆలోచనసభలో బాలుడు మొదలయిన యువకులు వొడంబడిక ప్రకారం మాచర్లను విడిచిపోకూడదనీ, యిప్పుడే యుద్ధముజేసి వీలయితే గురిజాలనుసహా సంపాదించవలసినదనీ వాదించారు. ప్రస్తుతం యుద్ధంజేసి నెగ్గలేమని బ్రహ్మనాయుడు నచ్చజెప్పితే సంతోషించుకొన్నారుగాని పూర్తిగా మానుకోలేదు. ఈ వొడంబడిక యేడుసంవత్సరము లయినా మాచర్ల మనకు వదిలిపెట్టరు. సేనలను సమకూర్చుకోవడం పూర్తిజేసుకొని, యే అపరాత్రివేళ మాచర్ల మండలంమీద వచ్చిపడతారో చెప్పలేము. పల్నాటి సరిహద్దులకు కొంత దూరములో నయినా విడిది యేర్పరచుకొన్నట్లైతే వాండ్లు బయలుదేరేజాడలు కనిపెట్టి సకాలములో యెదుర్కొనగలంగాని మందట చెట్టుమీది గద్దలాగ పీటపెట్టుకొని సమయానికై వేచివుండి యేమరుపాటున మాచర్లను తన్నుకొనిపోవడానికి సిద్ధంగా వున్న వాండ్లను అడ్డటం కష్టం.

నల. రా : తమ్ముడూ, నీవు దూరదృష్టి గలిగి యోచించి చెప్పినదంతా వాస్తవమేగాని మన మేకారణంచేత వారిని దూరంగా పంపగలం?

నాయ : నా కొక్క మాటచెప్పండి. ఈ యేడేండ్లు షరతుల ప్రకారం వారు నడుచుకొని తరువాత రాజ్యమియ్యమంటే యిచ్చివేస్తారా?

నల. రా : అది యెప్పుడూ జరుగదు. తిరిగి వారికిచ్చేకాడికి యిప్పుడు వారిని వెళ్లగొట్టడమెందుకు?

నాయ : షరతుల ప్రకారం రాజ్య మివ్వమంటే మీ రేమని కాదంటారు ?

నల. రా : రాజ్యం మాదిగాని మీదిగాదు ; యివ్వడానికి వీలులేదని స్పష్టంగా తెగజెప్పుతా.

నాయ : వారు కత్తిదూస్తే ?

నల. రా : మనమూ సిద్ధమే.

నర : నేను వారి కత్తికి భయపడనుగాని, అలరాజు యొక్క సంధిప్రయత్నాలకు భయపడతా. మీకు మొగమోట మెక్కువ. ఎదుటి మనిషిని కాదనలేరు.

నల. రా : తండ్రీ కొడుకులు శత్రువులతో జేరి వారి బాగోగులు తమవని యెప్పుడనుకొన్నారో వారి సంబంధ మప్పుడే తెగిపోయింది.

నర : మీ రీ మాటమీద నిలువలేరు.

నల. రా : నీవు నా మనోదౌర్బల్యం కనిపెట్టే చెప్పుతున్నావు గాని నేను గుండె రాయి జేసుకొన్నా.

నర : ఏమో, నాకుమాత్రం నమ్మకంలేదు.

నాయ : సరే, ప్రస్తుత మాసంగతి నిలపండి. ఒడంబడిక ముగిసేటప్పటికి యిప్పటికంటె వారు తప్పక బలపడతారు.

నర : యిప్పుడే కారణంచేత వారిమీదికి పోతాం ? లోకం మెచ్చుతుందా ?

నాయ : మొదట మీరు వొప్పుకొని మాచర్ల వారికిచ్చారు. ఏడు సంవత్సరము లయినతరువాత తిరిగి యిస్తామని మళ్లీ వొడంబడిక జేశారు. ఈ రెండు వొడంబడికల ప్రకారం మీరు పోయేటట్టయితే మీకేమీ పట్టులేదు.

నల. రా: మొదటివొడంబడిక నే నంగీకరించను. మోసకృత్య మని వెంటనే లోకానికి వెల్లడించాను.

నాయ: అయితే రెండవదీ నిలవదు. మొదటిదానిని సౌమ్యంగా రద్దుజేయడమే రెండవదాని వుద్దేశము.

నల. రా: అనే తేలుతున్నది.

నర: అని తేలితే, వారు రమ్మని పిలిచిందాకా వూరుకోక సమయం చూచి దెబ్బగొట్టడమే నీతి.

నాయ: అంతయోచన యిప్పుడు వద్దు. వారిని దూరంగా గొట్టేయోచన ప్రస్తుతం జేయాలె.

నర: వూరికే పొమ్మంటే పోతారా?

నాయ: వూరికే పోనిమాటే; వీరు మండాదిలో వేయిజనం కాపురం వుండడం, వేలకొలది పశువులను దౌర్జన్యంజేసి చుట్టుపట్ల మేపడం, అడవులలోవున్న చెంచుజనానికి పోడుగా వున్నది. వారి నుసికొలిపితే మన ప్రమేయంలేకుండా మూడురోజులలో లేవగొడతారు. చెంచులు బాధపడు తున్నారని తెలిసి నాయకుణ్ణి పిలిపించా. ఇప్పుడు కచేరీ హాలులో తమ దర్శనంకోసం కాచుకొనివున్నాడు.

నల. రా: తక్షణం పిలిపించండి.

నర: ఎవరురా అక్కడ? చెంచునాయకుణ్ణి లోపలికి రమ్మను

నౌకరు: చిత్తం.

[ చెంచునాయకుడు ప్రవేశము ]

చెంచు: సామీ, దణ్ణం; నీ పాదాలకాడివాణ్ణి. తమ దర్శనానికి చందమామకోసం వెన్నెలపిట్టలాగ కనిపెట్టుకొని వున్నా.

నల. రా: ఏమి పనిమీద వచ్చావు? భయపడక చెప్పు; మీ గూడెమంతా సుఖంగా వున్నాదా?

చెంచు: మా గూడేనికి వండవచ్చింది సామీ. మేము భూమి మీద నిల్చేకోవు లేదు. మా కందరికీ పోదెరువులు వచ్చినవి. మా చుట్టుపట్ల నాలుగామడలదాకా కీకారణ్యంగా వున్న అడవులన్నీ మారణమయిపోయినవి. చెట్లన్నీ కొట్టారు. ఒక బచ్చెనకట్టె చేసుకొనడానికి పుల్ల దొరకడంలేదు. పశువు నోటగరవడానికి గడ్డిపోచ లేదు. ఎక్కడజూసినా బెమ్మ నాయుడుగారి ఆవులు దిక్కుల కెగబాకి మేస్తున్నవి. ఎక్కడజూచినా వారి తొట్టుపట్లే

నల. రా: మీ రెక్కడికయినా లేచిపోమంటూరారా?

చెంచు: మేము యాడికి లేచిపోతాము సామీ? గడ్డపుట్టగా పుట్టినవాండ్లం.

నాయ: నాయకుడా, యిప్పుడేమి చేస్తా నంటావు?

చెంచు: నీవు దేవతవు. మనిషయిపుట్టి భూమి పాలిస్తున్నావు. నీవు తల వూచావాఅంటే పుంజులమూ, పెట్టలమూ పోగై లంకన్ననూ, ఆవులనూ తెల్లవారేవరకు సోదిలోకి రాకుండా కొడతాం.

నల. రా: గోపాలకులను కొట్టగలరుగాని సైన్యాన్ని మీరు ఎదిరించగలరా?

చెంచు: వాండ్లసైన్యాలు మమ్ము నేమీ చేయలేవు. చెట్టు కొకండ్లం చెదిరిపోయి అంబులు కురిపిస్తాం. గొడ్లుగాసే వాండ్లనుమాత్రం అడవిలో అడుగుబెట్టనియ్యం. వారం రోజులలో మందను మాటివేస్తాం. గెలుచుకున్న ఆవులలో సగం ఏలినవారికి కానుకయిస్తా. సగం నా కిప్పించ్చండి.

నల. రా: సరే, నీయిష్టం వచ్చినట్టుకానియ్యి. నాగమ్మ గారూ, నాయకుడికి తాంబూలమియ్యండి. నాయకుడా, సంగతులెప్పటివప్పుడు కామకా తెలియపరుస్తూవుండు.

చెంచ: రోజూ అంచె నడిపిస్తా. దండాలు సామీ !

నల. రా: వెళ్లు.

[ నిష్క్రమణం - తెరపడుతుంది ]

౩-వ రంగము

మండాదిలో మలిదేవరాజుగారి యిల్లు

[ మ. దే. రా. బ్రహ్మ. సభికులు ప్రవేశము ]

బ్రహ్మ: మహాప్రభూ, సభాసదులారా, మనము పల్నాటిని విడిచి పరదేశాల పాలయినప్పటినుంచీ మన ఆవుల మందలను కంటికి రెప్పగా కాచి మన శిబిరానికంతకూ జీవనం జరుపుతున్న లంకన్న వీరస్వర్గం బొందాడు.

మ. దే. రా: ఏమి ఆశ్చర్యం ! ఎవరు చంపారు ?

బ్రహ్మ: ఆ వీరుని మరణచరిత్రను కన్నమదాసువలన సావకాశంగా వినగోరుతున్నాను.

మ. దే. రా: కన్నమదాసూ, తూచాలుపోకుండా వీరచరిత్రను వినిపించగోరుతున్నాను.

క. దా: మహాప్రభూ ! మనము మండాది ప్రవేశించినప్పటినుంచి మనకు పడమరా, దక్షిణానా పెచ్చు పెరిగివున్న అడవులలో సంచరించి, లేబచ్చికలు మేసి, చెలమలలో నీళ్లుదాగి మనమందలు పెంపొందుతూ వచ్చినవి.

అడవులలో తిరిగే చెంచులు మనలను జూచి బెదిరి పరుగెత్తుతూ వచ్చారుగాని యే ఆటంకమూ కలిగించలేదు.

మ. దే. రా: అడవు లొకరి సొమ్ము గనుకనా? ఆక్రమించుకొన్నవాడే అధికారి.

క. దా: కాని వారమురోజులనుంచీ వారి నడవడి మారిపోయినది. మేతకు దూరముగా బోయిన మందలపై బడి చెంచులు వందలకొలది ఆవులను తోలగదోలుకొని పోతూ వచ్చారు. అది కనిపెట్టి లంకన్న మూడురోజులనుంచీ ఆవులను చెదరిపోనీక సమీపమున మేపుకొని మబ్బుపడక పూర్వమే తొట్టుపట్లకు జేర్చి తెల్లవార్లూ కావలిగాచి దొంగలకు అసిఆడకుండా చేశాడు. ఈ మూడురోజులూ ఒక్క జీవమయినా జాయా బోలేదు.

మ. దే. రా: లంకన్నయొక్క శక్తిసామర్థ్యములు మనకు దెలియనివా?

క. దా: కడచినరాత్రి చెంచులు యెత్తుమార్చి గుంపులు గుంపులుగా విల్లంబులతోను ఖడ్గములతోను బయలుదేరి....

బ్రహ్మ: వారికి ఖడ్గము లెక్కడివి?

క. దా: అదే చెప్పబోతున్నాను. దెబ్బతిని మాచే జిక్కిన చెంచును ప్రశ్నిస్తే తమ నాయకుడు గురిజాల బోయి నాయకురాలిదగ్గిర 200 కత్తులు దెచ్చినాడనీ, తమకు చేజిక్కిన పసరములలో సగము గురిజాలకు తోలిపెడుతున్నాడనీ చెప్పినాడు.

మ. దే. రా: సరే, కథకు మూలము దెలిసింది. తరువాత.

దా : తరువాత నోదేవా ! చెంచుల తండములు కొన్ని గోవులను, మరికొన్ని గోపాలురను ముట్టడించినవి. గోవులు దూడలను నడుమబెట్టుకొని మూడువల్లెములుదీరి మొగ్గరించి నిలచినవి. చెంచులు కట్టులు, కత్తులు దీసికొని ఆవులపై బడగా వాటిలో ముందలివరుస ముట్టెలు వోరవోంపుగా బెట్టి, తోకమట్టి లెగబట్టి, బుసకొట్టుతూ ముందుకు చెంగలించి ధుమికి చోరులను కొమ్ములతో చీరి, డొక్కలలో గుచ్చి యెత్తీ, గిట్టలతో మట్టీ హాతము గావించినవి.

హ్మా : బాగు బాగు, ఆ యావులు పల్నాటిగడ్డన బుట్టినవి గదా ! చారకొద్ది గొడ్డూ, కోరకొద్దీ పులీ అన్నారు.

దా : అంతట హాతశేషులు గోవులనువదలి గోపాలురనే తలపడ్డారు.

హ్మా : పల్నాటిలో పచ్చికనబుట్టిన పౌరుషము పశువులతో ఆగిపోతుందనుకున్నారుగామాలె. పండిపాతళ్లునిండి వీరుల రక్తములో వెల్లువగట్టింది.

దా : అంతట పోరు ఘోరమయింది. కోయలూ, చెంచులూ వికారధ్వనులతో అడవిమృగాలవలె కమరబడ్డారు. అప్పుడు వుభయులకూ జరిగిన యుద్ధము మనుష్యుల పోరువలెగాక వానర, రాక్షసయుద్ధంవలె ఘోరమై తోచినది. అడవిలో వున్న క్రూరమృగములన్నీ బాసటయై యిరువాగులా జేరి కోరలతోనూ, గోళ్లతోను పోరాడుతున్నట్లు కనబడ్డది. చెంచులు నిరాయుధులయిన గోపాలుర పెక్కండ్ర నుక్కడంచారుగాని, లంకన్నయొక్క బారుటీటె పోటులకూ, కత్తివాతి సరుకులకూ నిలువరించలేక పరుగెత్తారు. ఒక

చెంచు వెనుకపొంచుండి కోల్పులివలె దుమికి గురిజాలకత్తితో లంకన్న కుడిభుజమును నరికివైచాడు.

మ. దే. రా: లంకన్న కుడిభుజముతో మన కుడిభుజమూ పడిపోయింది.

బ్రహ్మ: నాగమ్మ బంపిన ఖడ్గమే మృత్యువునకు తోడ్పడినదా?

క. దా: నేలపడినభుజము భుజంగమువలె శత్రువును వెదకినట్టు నలువంకకూ బారినది.

బ్రహ్మ: శౌర్యము అతని యెముకలకుబట్టి వొంట జితించింది.

క. దా: అంతట సవ్యసాచియై యెడమచేతితో యీటెగొని అందిన చెంచునల్లా యేటు కొక్కనిగా పొడిచివేశాడు. తక్కిన యెరుకలెల్లరూ ఆ భీకరమూర్తిని చూచి నివ్వెరపడి పారిపోవడమునకూ, పోరాడడమునకూ కాలుచేతులాడక కత్తుల నేలవైచి, కట్టెలై నిలువబడ్డారు. నిరపరాధులపై కురుకుట కిచ్చగింపకనో యన్నట్లు బలమయిన గాయముచేత రక్తము క్షీణించి మన దుర్దశకు నిట్టూర్పువిడిచి నేల కొరిగాడు. ఇది హతశేషులవలన నే విన్న చరిత్ర.

మ. దే. రా: తమ నాయకుని గోల్పోయిన గోవులనూ, గోపాలురనూ వెంటనే శత్రువులు వశము జేసికొన్నారు కాబోలు. తరువాతి కష్టచరితమునుగూడ వినుటకు సిద్ధముగనే వున్నాము. దాసూ, త్వరలో ముగించు.

క. దా: త్వరలోనే ముగిస్తాను. కష్టకాలమల్పమయినా దీర్ఘముగనే కనబడుతుంది. గోపాలుర ఆర్తధ్వనులు విని చేరువలోవున్న యీ మీ దాసుడు.... (ఖిడియపడతాడు.)

మ. దే. రా : నిన్నుగురించి చెప్పుకొనడానికి సందేహిస్తున్నావుగామాలె ; మరొకవిధంగా తెలిసికొనడానికి ప్రస్తుతం మాకవకాశంలేదు. కనుక ఆత్మస్తుతి దోషమని యెంచక జరిగినదంతా వివరముగా మరొకడు జెప్పినట్టు నీవే చెప్పమని ఆజ్ఞాపించుతున్నాను.

క. దా : చిత్తము. నేను కత్తి చేతికి దీసుకొని చెదిరినగోపాలబలమంతా కూడదీసుకొని, హతశేషులయిన చెంచులనందరినీ తుదముట్టించి, మందలను మళ్లవేసి, మనవూరి గమిటీ దగ్గర నిలువవేశాము.

బ్రహ్మ : పల్నాటివీరున కర్హమయినరీతినే వర్తించావు. ఇక మీ కార్యమును నిర్ణయించుకోండి.

బా. చం : బాలుడనే కారణంచేత నా అభిప్రాయం యిదివరకొక పర్యాయము త్రోసిపుచ్చారు. మళ్లీ అవకాశం వచ్చిందిగనుక తిరిగి విన్నవించుతాను. మీ సేవకులలో మేటివీరు డొకడు ప్రముక్కుడి చెంచులచేతిలో బడి మరణించాడు. ఇటులనే గడువుదినాలలోపల తక్కినవారుకూడ గోవుల కని, గొఱ్ఱెలకని ప్రాణా లర్పించడం జరుగబోతుంది. అట్టి దుర్మరణము మాకందరికీ సంభవించకముందే మన నీ యిక్కట్టులపాలుజేసిన నాయకురాలినీ, దాని ప్రముక్కుడి అనుచరులనూ అంతమొందించడమో, లేక పల్నాటికై ప్రాణాలర్పించడమో మేము చేయగలముగాని వీరధర్మ మెరుగని హే యేనాదులచేతులలోనో చావలేము.

క. దా : రాజ్యములు వీరు లనుభవించతగినవిగాని విరాగు లనుభవించదగినవిగావు. గొడ్లకూ, గొదలకూ ప్రాణము

లర్పించడంకంటె వెంటనే దండయాత్రజరిపి పల్నాటికై ప్రాణాలర్పిస్తాము.

బ్రహ్మ : ఏదోవిధంగా యుద్ధములో చనిపోవడమే మన వుద్దేశం గాదు. నలగామరాజు పెట్టేబాధలను ఓపికతో సహించడము నకే యెక్కువధైర్యము కావలసివున్నది. ఇప్పటికి ఒక్క లంకన్నను గోల్పోవడము దప్ప తక్కిన మన చత్రమంతా యింతవరకు చెక్కుచెదరలేదు. మన అనుచరుల సంఖ్యకూడ క్రమంగా హెచ్చుతున్నది. పశుధనం వృద్ధయింది. సత్యం కొరకు కష్టా లనుభవిస్తున్నామని లోకు లనుకొంటున్నారు. గట్టిప్రయత్నం చేసేయెడల మన అనుచరు లింకా వృద్ధవు తారు. మన యువకు లింకా కొద్దికాలము ఓపికపెట్టుకొనే యెడల ఇహపరాలురెండూ మనవౌతవి. మనమందరమూ మండాది విడిచి పల్నాటికుట్రలకు దూరంగా శ్రీశైలప్రాంత మున మేడపిలో దిగుదాము. అది తృణకాష్టజలసమృద్ధి గల అడవిప్రదేశము. అక్కడ ఒకరిఆటంకము లేకుండా మనము యుద్ధప్రయత్నములు చేసికోవచ్చు.

మ. దే. రా : మనకు బహునాయకం పనికిరాదు. నాయుడు గారు చెప్పినట్టుపోవడందప్ప మరొక మార్గము మనకు పనికిరాదు. మేడపికి ప్రయాణం సాగించి మిగిలినరోజులు అక్కడ గడుపుదాము.

[ తెర పడుతుంది ]

## ౫-వ అంకము

[ ప్రతాపుడు ప్రవేశము ]

ప్ర: మానవుడు నాకూ, నాసోదరికీ ఆశాభంగమే కలిగించాడు. వాడికింకా శృంగారమంటే అర్థంగాలేదని నా సోదరంటుంది. ప్రతాపమంటే అర్థంగాలేదని నాకుతెలుసు. క్రౌర్యంలేని ప్రతాపమే వాడికి లేదు. కొమ్ములు, కోరలు, కొండీలు, గోళ్లు, గిట్టలు మొదలయిన మారణసాధనాలు లేకుండా వాడిని సృష్టించి సత్యవీరుణ్ణిగా చేతామని మా ఆశయం. "తలలు బోడులైతే తలపులు బోడులా ?" అన్నట్లు బాహ్యంగా మారణసాధనాలు లేవన్నమాటేగాని వాడి తలంపులన్నీ మారణసాధనాలే. జంతువులకు స్వాభావికముగావున్న మారణసాధనాలకంటె వేయిరెట్లు క్రూరమయిన సాధనాలు స్వబుద్ధిచేత కల్పించుకొన్నాడు. పశుత్వంలోనుంచి మానవత్వమనే మెట్టుకూడా యెక్కలేదు. క్రమంగా యెక్కుతాడనుకొంటాను. మానవత్వం వదలి దేవత్వం వచ్చేవరకు చాలాకాలము పట్టుతుంది. అంతవరకూ మామూలుమార్గాన్నే పోతూవుంటాడు.

[ నిష్క్రమణం ]

## ౧-వ రంగము

## పల్నాటి సరిహద్దులు

[ మ. దే. రా., బ్రహ్మ., కొమ్మ., బా. చం., క. దా., అ. రా. మొదలైనవారు ప్రవేశము ]

బ్రహ్మ: ఇదే, పల్నాటి సరిహద్దు దాటుతున్నాం. ఏడేండ్లకు సెలవుగా జన్మభూమి మళ్లీ తొక్కుతున్నాం. అంతా పల్నాటిమాతకు సాష్టాంగనమస్కారం చెయ్యండి. (నమస్కారముచేసి లేచి) ఆహా! మన లంకన్న లేకపోయె గదా! వుంటే యెంత ఆనందపడేవాడు! మనతో కష్టములలో పాల్గొన్నాడుగాని, సంతోషములో భాగస్వామి కావడానికి ప్రాప్తం లేకపోయింది.

మ. దే. రా: అమ్మా, పల్నాటిసీమా, నీ ప్రియపుత్రుడయిన లంకన్నను మింగి వచ్చాం.

బా. చం: రాబోయే రణయజ్ఞములో లంకన్నకు బదులుగా మమ్మును ఇంధనములుగా ఉపయోగించండి.

క. దా: సంతోషచిహ్నముగా మనమందరమూ యిక్కడ విడిసి పల్నాటిమాతకు చద్దీ, వేడీ పెట్టుకొందాము. ఆవులకు అలంకారాలు చేయింతాము.

బ్రహ్మ: ఇవ్వాళ పొంగలిపండుగ, రేపు ఆవులపండుగ, కానియ్యండి. ఇంకాముందుకు సాగకపూర్వం గడువు పూర్తిఅయిందనీ, మాచర్ల మా కియ్యవలసినదనీ సమాచారం పంపి జవాబు తెప్పించుకొందాము. బదులువుత్తరం వచ్చే వరకూ యిక్కడనే ఉత్సవాలు చేసుకొంటూ వుందాము.

కొమ్మ : ఈ సూచన చాలా బాగావుంది. ఇంతవరకూ దేశం వారి స్వాధీనములో వున్నదిగనుక చెప్పి ప్రవేశించడమే మర్యాద.

బా. చం : గోదావరిస్నానానికి కొండుభొట్ల ఆజ్ఞెందుకు? పల్నాడు మన మాతృభూమి, బిడ్డలు తల్లివొళ్లో కూర్చోవడానికి ఒకరి ఆజ్ఞా?

అ. రా : చెప్పి పంపకపోతే కలహానికి కాలుదువ్వినట్టుగా వుంటుంది.

అనపోతు : కలహంలేకుండా రాజ్యమిస్తారనేనా మీ నమ్మకం? అట్లయితే భారతకథ అబద్ధ మనవలసివస్తుంది.

అల. రా : నలగామరాజు దుర్యోధనుడికంటె మంచివాడు. కేతురెడ్డి శకునంత దుర్మార్గుడు గాడు.

అనపోతు : నరసింగరాజు దుశ్శాసనుడికంటె దుష్టుడు.

బా. చం : ఆలోచనలో నాగమ్మ కర్ణుడికంటె సమర్థురాలు.

క. దా : మనకు బ్రహ్మనాయుడనే కృష్ణుడున్నాడు.

కొమ్మ : దుర్యోధనుడికి కృష్ణుడితో సమదీటయిన మంత్రి లేడు. నాగమ్మవల్ల నలగామరాజు కాలోపం నివర్తి అయింది.

బా. చం : కనుకనే మనభారం మఱింతయెక్కువయింది.

కొమ్మ : అందుకనే పోరుకంటె పొందు మేలని చెపుతున్నా.

బా. చం : కాబట్టే నలగామరాజు బొత్తిగా సంధి కంగీకరించడు

కొమ్మ : ఆ తప్పు వాండ్లమీదనే పెడదాం.

బా. చం : తిరిచి భోగించడం దీనులపని. క్షత్రియధర్మంగాదు.

కొమ్మ : ఇందులో ఆశ్చర్యమేమున్నది? అయినా ధర్మరాజు మార్గాన్నే మన మవలంబిస్తున్నాము.

అనపోతు : మొదటినుంచీ వాండ్లసంగతి తెలిసికూడా పొరబడుతున్నారు. రాయబారానికి సాధారణంగా నాయకుణ్ణి పంపుతాముకదా!

కొమ్మ : వాడంటే కంచమంతా వో డనగూడదు. ఉభయులమూ పరాయివాండ్లంగాదు. బంధువర్గముతో యుద్ధమంటే వచ్చే సాధక బాధకాలు మీకు దెలియవు. ఇది ఉద్రేకంతో తీరుమానించవలసిన విషయం గాదు.

బ్రహ్మ : సామోపాయంవల్ల చక్కబడేపనికి దండోపాయం ప్రయోగించగూడదు.

బా. చం : మాచర్లమండలంలో యిప్పటివరకు విశేషంగా సేనలు లేవు. మనము ముందు పోయి ఆక్రమించుకొంటే తరువాత మనను వెళ్లగొట్టడం కష్టం.

బ్రహ్మ : ముం దాక్రమించుకొనడంవల్ల తాత్కాలికలాభమున్నట్టు కనబడ్డా, మాచర్లకు కోటగోడలు లేకపోవడంచేత వారి సేనలు వచ్చినతరువాత ఆమోద ముండదు. అదిగాక మనం మాచర్ల బలవంతంగా ఆక్రమించుకోబోతే జనులు యెదిరిస్తారేమో చెప్పలేము. తొందరపడితే లాభం లేదని తోస్తుంది.

కొమ్మ : ఒడంబడికప్రకారం మనకు రావలసిన భాగం సౌమ్యంగా అడిగినప్పుడు వారు కాదంటే లోకానికి విడ్డూరంగా తోస్తుంది. జనము మనకు తోడ్పడకపోయినా ఎటూ చేరకుండా తటస్థులుగానయినా వుంటారు.

బ్రహ్మ : రాయబారం విషయమయి మనలో అభిప్రాయ భేదాలు తీవ్రంగా వున్నవి. ఎటు జూచినా రాయబారమే ఉత్తమంగా నాకు కనబడుతున్నది.

మ. దే. రా : రాయబారిని ఏర్పాటుచేయండి.

క. దా : అలరాజుగారిని రాయబారిగా పంపితే బాలుడు చూపించిన చిక్కు లుండకపోవచ్చు ! ఆయన ఉభయు లకూ అక్కరగల మనిషి

బా. చం : లోకానుభవంగలవారు, వారి తండ్రిగారిని పంప గూడదా ?

బ్రహ్మ : అల్లుడు మొగమోటపెడితె నలగామరాజు తీసివెయ్య లేడు. తండ్రిగారికంటె కొడుకును బంపడమే మెరుగు.

కొమ్మ : నే వెళ్లుతాలెండి.

బ్రహ్మ : ఆయనకు అల్లుడిమీద మక్కువెక్కువ. అలరాజు వెళ్లితే అంతఃపురం మనపక్షమవుతుంది.

మ. దే. రా : ఇంతతర్కమెందుకు ? వెళ్లడానికి అలరాజు అంగీకరిస్తాడా ?

కొమ్మ : అతని అంగీకారమేమిటి ? అంతా వెళ్లమంటే వెళ్లు తాడు.

అ. రా : నా అభ్యంతరంలేదుగాని నరసింగరాజు కేటించి గట్టి పట్టు పట్టితే నామాట సాగదు.

బ్రహ్మ : చేతనయిన ప్రయత్నం చెయ్యండి. రేపు ఉదయం ప్రయాణం. మీకు ప్రత్యేకంగా ఎత్తిచెప్పవలసిన దేమున్నది ? మనది కుంటుంబ కలహం. ఉభయులకూ నష్టకరమయిన

యుద్ధం పొసగకుండా మాచర్లమండలం మన కిచ్చే సదు
పాయం చేయవలసినదని మా ప్రార్థన.

న. దే. రా : తాంబూల మియ్యండి.

[ అంతా నిష్క్రమిస్తారు  తెరపడుతుంది ]

౨-వ రంగము

[ నౌకరు ప్రవేశము — చెర్లగుడిపాడు ]

నౌ : ఎవరా వచ్చేది ! వారేలాగున్నారు.

[ అలరాజు ప్రవేశము ]

అ. రా : ఇ దేవూరు ?

నౌ : చెర్లగుడిపాడు. మంత్రిగారికోసం వచ్చారా ?

అ. రా : ఏమంత్రిగారు ?

నౌ : నరసింగరాజుగారు, అదే వారి బస. ఇప్పుడు ఖాళీగానే
వుంటారు, చూడవచ్చు.

అ. రా : నీవు వారి నౌకరువా ?

నౌ : అవును తను నౌకరునుమాత్రం కాదా? తమరు పెద్ద
దొరగారి అల్లుడుగారుగదా ? దేశంలోకి మళ్లీ వచ్చారని
అనుకుంటున్నారు.

అ. రా : ఎవ రనుకుంటున్నారు ?

నౌ : దేశమంతా అనుకుంటున్నారు. చిన్నదొరగారుగూడా
ఎప్పుడూ అనుకుంటూనే వుంటారు.

అ. రా : ఏమనుకుంటారు ?

నౌ : తమరు మంచివారనీ, ఇతర్లమూలంగా కష్టాలుపడు తున్నారనీ, అనుకుంటారు. ఇప్పుడు నే బోయిచెప్పితే వారే పరుగెత్తుకుంటూ వస్తారు.

అ. రా : (స్వగతం) (ఇతని మాటలనుబట్టి వారు చాలా సుముఖంగా వున్నట్లు కనబడుతారు. వారు అనుకూలిస్తే మనకార్యమే నెరవేరుతుంది.) (ప్రకాశముగా) వారు రావడమెందుకుగాని నేనే వస్తా, దారి జూపు.

నౌ : చిత్తం, దయచెయ్యండి దేవర !

[ ఇద్దరూ తెరలోపలికి బోతారు ]

[ నరసింగరాజు, నౌకరు ప్రవేశము ]

నౌ : అలరాజుగారు యిక్కడికే వచ్చారు.

నర : ఇక్కడి కెట్లా వచ్చారు ?

నౌ : పొద్దటినుంచి నే పడమటి డొంక కాచేవున్నా. దూరంగా చూచి వూళ్లోకి పరుగెత్తి అడ్డబజారున వారి కెదురుబోయి మిమ్ములను చూడడానికి యిక్కడికి తీసుకొనివచ్చా. వంట యింట్లోకి కుందేలు వచ్చి దూరింది.

నర : నే గురిజాలకు ప్రయాణమవుతుంటినిగా, ఆ మాట చెప్పి లోపలికి తీసుకురా.

నౌ : అయ్యా, లోపలికి దయచెయ్యండి. అయ్యగారు గురిజాలకు ప్రయాణమై చెప్పుల్లో కాళ్ళు బెట్టుకొనివున్నారు.

[ అలరాజు ప్రవేశము ]

అ. రా : తమరూ ప్రయాణమౌతున్నట్లున్నారు !

నర : ఓహో అలరాజుగారా ! ఎంతకాలానికి చూడడమయింది ! ఇది గొప్పసుదినం. రాజధర్మాన్నిబట్టి, రక్తబంధములు గూడా ఇట్లా దూరంగా వుండవలసివచ్చింది. ఇక్కడికి అదృష్టవంతులమే. అంతా తిన్నగా వచ్చారా ? ఇదెట్లా, ఇంతకాలానికి కుశలంగా వచ్చినందుకు నెమ్మదిగా మాట్లాడడానికికూడా అవకాశంలేదు. నౌకరీ వొప్పుకున్నతర్వాత శరీరం అమ్ముకున్నట్టే. స్వాతంత్ర్యంలేదు. రాజుగారి దగ్గరనుంచి నన్ను తక్షణం రమ్మని ఉత్తరువు వచ్చింది. భోజనంగూడ అక్కడనే చేతామని బయలుదేరుతున్నా. ఏదో అగత్యంగా సలహాపదమున పుట్టింది. తమరు కాళ్లు కడుక్కోండి, వంటవుతున్నది. భోజనంచేసి కొంచెం విశ్రమించి బయలుదేరితే ప్రొద్దుగూకేవరకు గురిజాల చేరుతారు.

అ. రా : నేనూ బయలుదేరుతా మీతోటే ; మాట్లాడుతూ పోదాం.

నర : మీరు దూరంనుంచి వస్తున్నారు ; అలిసివుంటారు. తొందరేమి ? నిదానంగ చేరండి.

అ. రా : నేనూ రాజసేవమీదనే వచ్చా. మిమ్మును తొందరగా పిలిపించడానికి కారణం నా రాకనుగురించి మాట్లాడడానికే అయివుంటుంది. తమరు రాజుగారిని సందర్శించక ముందే మీతో నే వచ్చిన పనిని—సంధికార్యమునుగూర్చి మాట్లాడుదామని వున్నది.

నర : అయితే బయలుదేరండి. ఒకరివర్గీలో వున్నవాండ్లకు వేళకు భోజన మెట్లాసంభవిస్తుంది ?

[ ఉభయులూ బయలుదేరారు ]

అ. రా : నేను వచ్చిన విషయం తమతో మనవిచేస్తాను, దయ చేసి సావకాశంగా వినండి.

నర : అవశ్యం.

అ. రా : మా వాండ్లు యేడేండ్లు అష్టకష్టాలు పడి సమయం నెరవేర్చి వచ్చారు.

నర : మనవాండ్లని అనండి. నేనుమట్టుకు వాండ్లనుగురించి మనసులో విచారించడం లేదనుకున్నారా? మనవాండ్లు వస్తున్నారని తెలిసే అహోరాత్రులు కర్తవ్యమే విచారిస్తున్నా.

అ. రా : చిత్తం. కుటుంబకలహం జరుగకుండా వ్యవహారం సర్దే ఉపాయ మేదో తమరే యోచించండి.

నర : నేను అరవిడిచి మీతో చెపుతాను. అటు అన్నా, ఇటు తమ్ములూను. ఎవరికి ఆపద వచ్చినా నాకు వచ్చినట్టే. అన్నగారు ఒక మాటమీద నిలువరు. సలహాదారులు ఒకరుగారు. ఆయనకు ఏది నచ్చితే ఆ ప్రకారం పోతారు. ఒక్కొక్కప్పుడు ఇతరు లెన్నిచెప్పినా తన కెంతతోస్తే అంత. ఇతరు లెంతజెప్పినా ససేమిరా అంటారు.

అ. రా : అవును. ఆ మాట నిజమేకాని తమమాట తీసివెయ్య లేరు. తమరు గట్టిగా పట్టుపడితే కుటుంబకలహం ఆపివేయగలరని నా నమ్మకం.

నర : సంధికావడం నాకు మిక్కిలి సంతోషం. నాకంటె మీయందు వారికి మక్కువెక్కువ. మీరు గట్టిపట్టు పట్టండి ; కాకెక్కడికి పోతుందో చూతాము.

"సంధిమిచ్ఛంతి సాధవః" అన్నారు. అట్లాగే పని జేతాము. ఎట్లయితే కుదర్చునని చెప్పారు ?

అ. రా : మాచర్లమండలం తమ్ముల కియ్యడానికి అన్నగారు మొదట ఒప్పుకొన్నదేకదా ! యీ యేడుసంవత్సరాల నుంచీ వీరే అనుభవిస్తుండిరి.

నర : తాను బుద్ధిపూర్వకంగా ఒప్పుకోలేదంటారు.

అ. రా : కాకపోతేమట్టుకు తనకుమాత్ర మేనూరుమంది వున్నారు. ఒక్క ఆడపిల్లేగదా !

నర : అట్లని రాజ్యం వదలుకుంటారా ? మనం సంపాదించేదంతా మనకోసమేనా ?

అ. రా : తనతరువాత రాజ్యం దౌహిత్రాన్ని బట్టి మాకుటుంబములోకే వస్తుంది. దాయాదులతో తగాదా లెందుకని బ్రహ్మనాయుడు చెప్పిన రాజేకికూడా మొదట ఒప్పించా. కన్నుదగిలేపుల్లను ప్రతిదాన్నీ కనిపెట్టేవుండాలె.

నర : నా సంగతేమీ చెప్పించరా ? మీకు కొమాళ్లు కలుగకపోతే నేనే తరువాతవాణ్ణిగదా ?

అ. రా : ఇప్పటికి మీ అన్నే రాజుగవా. అధికారమంతా మీరే చలాయిస్తుంటిరి. వారసత్వం వచ్చినప్పుడు మీ సంగతి చెప్పకుండానా ? ఏ మట్లావున్నారు ? బొత్తిగా వేలబడిపోతున్నారే !

నర : భోజనానికి వేళదప్పింది. మైశ్వపుశ్రమ వచ్చింది. ఇంకా వూరు ఎంతదూరముండేను ?

అ. రా : ఎంతలేకేమి ? రెండుకోసు లుంటుంది.

నర : రెండుకోసులు కాదుగదా, రెండుబారలుకూడా నడవలేను. దగ్గరలో చెట్టేమయినా వుందేమోచూడండి. నీడ వుంటే కాస్త తెప్పరిల్లిందాకా వొడ్డిగిలబడతా.

అ. రా : ఈ పక్కచేలోనే చింతచెట్టువుంది. దానికింద యిద్దరు సన్యాసులుగూడా వున్నట్టున్నారు. నా బుజాన చెయివేసి రెండడుగులు వేస్తారా?

నర : అ కనపడేదేనా! కండ్లు భ్రమగప్పి లీలగా కనపడుతున్నవి. పదండి. సన్యాసులో, మాచకమ్మలో యెవరయితేనేమి ?

అ. రా : దారిన రండి.

నర : ఇశ్శో.

అ. రా : ఒక్క నిమిషమాగి అలుపు దీర్చుకోండి.

నర : పదండి.

అ. రా : వుండండి, నీడన గుడ్డ పరుస్తా. కాస్త తలవాల్తురుగాని.

నర : ఎవరయ్యా మీరు ?

గో : మేము గోసాయిలం.

నర : బ్రాహ్మలా ? మేము రాజులం.

గో : బ్రాహ్మలమే.

నర : అయితే కాస్త దాహమియ్యండి నాయనా.

[ దాహమిస్తారు ]

నర : (తాగి) తమరు పొద్దుటినుంచి నడిచివచ్చారు. ఇంకా దృఢకాయులుగనుక ఓపికగా నడుస్తున్నారు. మీరు సాగి పదండి. వెనకడితే నేనూ బయలుదేరుతా.

అ. రా: మిమ్ములను ఈ యెడారిలో వదిలిపెట్టి పోతానా? ఇద్దరం కలిసేపోదాము. గోసాయిలదగ్గర యేమయినా వున్నదేమో, ఎంగిలిపడుతారా?

వర: నా కెన్నడూ స్నానంలేని భోజనం మామూలు లేదు. హరీ అనేదాకా అట్లా జరుగవలసిందే. నాస్తాచెయ్యండి. నన్ను నడిపించుకపోదురుగాని.

గో: అయ్యా, మీరు యెండనబడి వచ్చారు. కలో అంబలో మా కున్నది స్వీకరించండి.

వర: నీళ్లు దగ్గరలో వున్నవా?

గో: అరమైలు పోవాలె. స్నానంజేసి బిందెలో తెచ్చుకుంటే వంటకురాగా దాహానికి మిగిలినవి. అవీ కటికివుప్పులు. విషప్రాయంగా వున్నవి.

వర: నా సంగతిక వట్టిదే. చిన్నవారు మీకేమి, కాస్త నాస్తా చెయ్యండి. నన్ను నడిపించుకపోదురుగాని.

1. గో: నాకు సంధ్య ఇంకా ఆలస్యమున్నది, వారికి, వడ్డించు.

2. గో: అయ్యా, కూర్చోండి వడ్డిస్తా - (వడ్డించి) - సుకుమారులకు మీకు సయిస్తుందా-కాలేకడుపుకు మందేగంజి. కండ్లు మూసుకొని రెండుముద్దలు మ్రింగండి.

[ తెరలో భోజనమయింది ]

వర: ఇక మెల్లగా నడుస్తామా, కాస్త తేరుకున్నా?

అ. రా: లెండి. అన్నం తిన్నప్పటినుంచి గుంభింపుగా వున్నది. నాలుక విరుస్తున్నది.

నర : ఉప్పునీళ్లచేత. త్వరగా పదండి. ఈ నీళ్లే మళ్లీ తాగితే నాలుక మరీ విరుస్తుంది. ముం దెక్కడనయినా మంచినీళ్లు తగలకపోతవా ! [ కొంతదూరం పోతారు. ]

[ గోసాయిలు పలాయనం ]

అ. రా : అయ్యో ! నాకు కాళ్లు తీస్తున్నవి. నాలుక పీకుతున్నది. మంచినీళ్లు దొరికితే బాగుండు.

నర : మరే. ఊషరక్షేత్రం. దగ్గరలో నీళ్లు లేవు. త్వరగా అడుగు వెయ్యండి.

అ. రా : ఇంకేమడుగులు. ఇక నడవలేను.

[ అని కూలబడతాడు ]

నర : నే బోయి నీళ్లు తేనా ?

అ. రా : నీ........[ అని ప్రాణము విడుస్తాడు. ]

నర : నడిదార్లో యెందుకు ఈ పీనుగ ; రాయబారం ముగిసింది.

[ శవాన్ని పక్కచేలోకి లాగి నరసింగరాజు వెళ్లుతాడు. ]

## ౬-వ అంకము

[ప్రతాపుడు ప్రవేశము]

ప్ర : ఇది భయానకరూపం. మీ కేదో భయంకరంగా వుంటుంది. కాని నాకు అన్నిరసాలు వొకటే. నేను అనేక మార్గాల లోకసంహారం చేస్తూవుంటాను. ఒకరయిలు పడదోస్తా— అనేకమందికి కాళ్ళు, చేతులు, మెడలు, విరుస్తా. ఒక అడవికి అగ్గిముట్టిస్తా—వేలజంతువులను మాడుస్తా. ఒకప్లేగు దెప్పిస్తా—లక్షలను చంపుతా. నా కేమయినా విచార మనుకొన్నారా? ఇవన్నీ ఆనందంగా చేస్తా. నేను ఆనంద దాయకుణ్ణి.

[నిష్క్రమణం]

### ౧-వ రంగము

### కారెంపూడి

[నలగామరాజు, నాయకురాలు ప్రవేశము]

నల. రా : అలరాజు కండ్లలో మెదులుతున్నాడు. అల్లు డయినా అతడే, కొడుకయినా అతడేకదా అనుకున్నాను. ఇటు ఘోరవిచారమూ, అటు అపవాదమూ కూడా భరించలేకుండా వున్నాము.

నాయ : పుణ్యాం, పాపం దేవుడికి దెలుసు. నోరుముయ్యా మూత లేదు. నరసింగరాజుగారిమీద వాండ్లు నిందమోపారు.

నర : అది నే నెప్పుడూ నమ్మను. అతడు చంపవలసిన అవసర మేమి వచ్చింది? అతడిద్వారా రాజీకూడా కుదిరేది.

నాయ : ఈ అపవాదుచేత ఆయనమనస్సు చాలా వైకల్యం బొందింది; సేనల నన్నిటినీ నడపవలసినవాడు.

నల. రా : ఎవ రేమనుకున్నా నాయం దతనికీ, అతనియందు నాకూ భేదభావం లేదు.

నాయ : వాస్తవం. రెండుజాములయింది. యుద్ధభూమినుంచి యింకా మనుష్యులు రాలేదు.

నల. రా : వాకిట్లో చప్పుడౌతున్నది. ఎవడురా అక్కడ?

నౌ : (ప్రవేశించి) రణభూమినుంచి చిన్నదొరగారు వచ్చారు. మిమ్మును చూడగోరుతున్నారు.

నల. రా : తక్షణం రమ్మను.

[ఝట్టిరాజు ప్రవేశము]

ఝట్టి : అన్నయ్యా, నమస్కారము.

నల. రా : విజయోస్తు. సమాచారములేమి?

ఝట్టి : అలరాజు మరణవార్త శత్రుశిబిరములో తెలియంగనే యుద్ధప్రకటనలు లేకనే బ్రహ్మనాయుడు వారించినా వినక బాలుడూ, అతని అనుచరులూ తోక దొక్కిన తాచుల వలె లేచి, రణభేరి వాయించి, యుద్ధమునకు బయలు దేరడమూ ఇక విధిలేక తక్కినవారందరూ వారివెంట బయలుదేరడమూ మీ రెరిగిన విషయమే.

నల. రా : అవును తెలుసును. బాలుడు బలుదుడుకుపిండము.

ఝట్టి : చెల్లాచెదరుగా బయలుదేరిన సైన్యము లన్నిటినీ బ్రహ్మనాయుడు మార్గమధ్యమున నిలువరించి, మొగ్గరముగా నమర్చి, కారెంపూడిలో గంగధారిమడుగుదగ్గర విడిసివున్న మన సేనలమీదికి బయలుదేరాడు.

నల. రా : తరువాత?

ఝట్టి : తరువాత, ఆహవపాండిత్యమున నారితేరిన నరసింగ భూపతిచేత నడుపబడుతూ, వీరాధివీరుడయిన మాడుగుల వీరారెడ్డిచేత అభిరక్షితమయిన మనసేనలన్నీ శకట వ్యూహముగ నమర్చబడి. గంగధారిమడుగు ఉత్తరంగితమై పొంగిపారలినట్లు గన్పడినది.

నల. రా : అంత నేమయినది ?

ఝట్టి : యుధిష్ఠిర ప్రతిముడయిన....

నల. రా : శత్రువును ప్రశంసించడమూ వీరలక్షణమే.

ఝట్టి : బ్రహ్మనాయుడు ఆహవదోహాలుడైన కన్నమదాసునూ, అభిమన్యుకుమారుంబోలు బాలచంద్రుడునూ ముందు నడువగా, అతిభయంకరమయి శత్రుసేన గరుడవ్యూహ ముగ నమరి మన సేనల ముట్టడించగా సముద్రము లుప్పొంగి ఒండొంటిం దాకినట్లు గన్పడినది.

నల. రా : ఇట్టిదృశ్యములు వీరులహృదయాలను పొంగజేస్తవి.

ఝట్టి : అంతట ఉభయపక్షములూ వచ్చందాలు బడ్డట్లు యుద్ధము ప్రారంభించక కొంతవడి వూరకున్నారు. బాలుడీ దుస్సహమయిన విరామమును విరమింపజేసి నారాచమొకటి విడువగా ఒక్కుమ్మడిన మన సేనా సముద్రమంతటను అంపజల్లు గురిసినది. మనవారి కవి చిటి చినుకులప్రాయమై సరకుసేయనట్లు గనుపట్టినా అమ్ములు కుప్పతిప్పలై జడివానగా శత్రువులపై గురిసినవి. ఇట్లు కొంతవడి అమ్ములతో చెర్లాటలాడి, వెట్టబుట్టి, విండ్లు బుజములకు దగిలించి, కృపాణములు, సన్నిలు, బరిసెలు చేతికి దీసికొని, తారసిల్లి ముహూర్తమాత్రములో దేహములు గడికండలుగ గోసుకొనసాగారు. రణరంగమంతా

పుత్తలమయమయినది. సైనికు లవి చూచి వొళ్లు మరచి వున్మత్త పిశాచములవలె ఒండొరులు దలపడి, హతము గావించుకొని పనలు పనలుగా పడిపోయినారు. సేనాముఖ మంతా పలుచబడ్డది. తుదకు తెగిపడిన మొండెములు దప్ప, సవ్యముగ వున్న కళేబర మొక్కటీ గన్పడలేదు. శవముల కుప్ప లడ్డమయి సైన్యము ముందుకు సాగివచ్చుటకు వీలు జిక్కక కొంతవడి యుద్ధము నిలిచిపోయినది.

య : రణరంగ మెంత బీభత్స మయినది? నే వెళ్లి పాల్గొనిన బాగుండు. నా కవకాశము కలుగకముందే యుద్ధము ముగుస్తుందేమో?

రా : తొందరపడవద్దు. తరువాత నేమి జరిగినది?

: యుద్ధమును సువ్వీ అని మొదలుబెట్టిన బాలచంద్రుడే, చాకల చందన్న, మంగలి మంచన్నలను రెండుపక్కల నిడుకొని, పీనుగుల తిప్పలెక్కి దుమికి అడ్డమువచ్చిన సైనికుల చించి చెండాడుతూ, మన వాహినీపతి యయిన చింతపల్లిరెడ్డిని దలపడగా ఆత డా ముప్పురు వీరులతో కొంతవడి పోరి పాటవము చెడి పలాయనము కాబోగా మన చమూపతి కొదమగుండ్ల నరసారెడ్డి బాసటయినాడు. బాలుని కడ్డము వచ్చి, చిత్రగతుల యుద్ధపాండిత్యము జూపి, రెండమ్ములు బరపి చందన్నను సమయింపజేసి, ఈటెపోటుతో మంచన్నను నేలకు దెచ్చాడు. వారి ఇరువ్వురిపాటు జూచి బాలుడు తోకతొక్కిన తాచై నరసారెడ్డి నొడిసి పట్టుకొని ద్వంద్వయుద్ధమునకు దలపడగా పెద్దమలిసీడు చింతపల్లిరెడ్డికి అడ్డము వచ్చాడు. రెడ్డియును నిలువరించుకొని యెదురుతిరిగి రాగా కొంతవడికి బాలచంద్రు

డా నరసారెడ్డినీ, మలినీడు చింతపల్లి రెడ్డినీ మడియించి యిద్దరూ యేకమై మన తూర్పుసైన్యములం దాకగా నలగొండ బాపన్నా, కోలంకి వీరాస్వామి, పొదితె పాపన్నా వారి కడ్డుపడి సైన్యముల రక్షించుకొన్నారు.

అప్పటికి రెండుజాములు కావచ్చినది. ఖానుప్రభల నినుమడించి గండరగండడని పేర్వడిసిన మాడుగుల వీరారెడ్డి ఆరితేరిన ఆహవపాండిత్యముకు మొక్కవోని ప్రతాపము బాసటగా శత్రుసైన్యములపై బడి నుగ్గు నూచముగ జేస్తుండగా, సేనాపతు లెంతప్రోత్సహించినా నిలువలేక పారిపోవు సేనలను మరలించుకొంటూ పిన్నమలి దేవుడు అడ్డమై మాడుగుల జోదుయొక్క ప్రతాపాగ్నికి ఇంధనమై ఒక్క నిముసములో సమసిపోయినాడు.

నాయ : ఇది బ్రహ్మనాయుడికి మొదటిదెబ్బ.

ఝట్టి : రాచకొడుకు పడంగానే బాలునిసైన్యములో హాహాకారములు చెలరేగినవి. విచారం, కోపం, డంబము వర్ణనాతీతమయినవి. బ్రహ్మనాయుని సేనాసముద్రపుకెరటము లన్నీ, మాడుగుల వీరుడను పర్వతముపై గొట్టనారంభించినవి.

నల. రా : (ఆశ్చర్యముతో) వీరడే వీరుడు.

ఝట్టి : మబ్బులుగప్పిన మార్తాండునివలె వీరారెడ్డి సైనిక సమూహములో మరుగై పోయినాడు. మన వీరులందరు త్వరపడి వీరారెడ్డికి బాసటలైయెనారుగాని వానిం జేరలేక పోయినారు. కొంతవడికి వీరారెడ్డి విరమించెనని శత్రువుల సింహనాదములు ప్రకటించినవి. మనసైన్యము గ్రహణము

గప్పిన పగటివలె కాంతిహీన మయినది. విరామఘంట విన
బడగానే యెవరిశిబిరములకు వారు పోయినారు. నే నిట
వచ్చాను.

నల. రా : వీరారెడ్డికి వీరోచితమరణము సంభవించినది. అతడు
లేనిలోపము మనము నివృత్తిచేయలేము.

ఝట్టి : సెలవిండు. రణరంగమునకు వెళ్లుతాను.

[నిష్క్రమణం]

నల. రా : ఏ మా కలకలము ?

[ఝట్టిరాజు తెరలో]

యోధాగ్రేసరులారా ! తమ్ముని మరణముచే క్రోధ
మూర్తియై మలిదేవభూపతి అలరాజు మరణమునకై కసిబట్టి
వున్న బాలచంద్రుని బాసటచేసుకొని బహుళసేనా
సమేతుడై నరసింగభూపతి నొంటరిగా దాకి పట్టుకొన
బోతున్నాడు. బిక్కమొగంబులు వైచుకొని పరువెత్తెద
రేల ? మాడుగులరెడ్డి మరణించుటచే అసహాయుడై సేనల
గోత్తలు సేయలేకున్న సేనాధ్యక్షుని విడిచి పారిపోయెద
రేల ? ఓరీ పాపులార ! బాలుడు పట్టనే పట్టినాడు. అయ్యో,
యెంతకష్ట మెంతకష్టము ? సేనాధ్యక్షు డిట్టి దిక్కులేని
దుర్మరణమునకు లోబడుట విధినియతిగదా !

నాయ : (లేచి) తే తెమ్ము. ఓరీ ! పిరికిపందలారా! నాగాంబిక
ఖడ్గము ధరించివుండగా నరసింగభూపతి కెట్టి విపత్తును కలుగ
జాలదు. పారిపోయి కలకాలము జీవించగలరా ?

(నిష్క్రమణం)

[ ఝట్టి తెరలో ]

కోటకేతురెడ్డి మరలించినా మరలక సైన్యములు విరిగి నిర్వీర్యమై పారిపోతున్నవి. ఆహా! నరసింగభూపతి వీర స్వర్గము నందినాడు.

నల. రా: అయ్యో! తమ్ముడా! నాయందే నీ ప్రేమంతా వుంచి లక్ష్మణుడు శ్రీరాముని గాచినట్లు న న్నింతవరకు కాచి, రక్షించి న న్నిపుడేల విడిచిపోయినావు? నీవు లేని రాజ్యము నాకెందుకు? నీకై పోరాడబోయిన నాయకు రాలికి బాసటై శత్రుసంహారము గావించి నీ ఆత్మసంతృప్తి గలిగింతునుగాక!

ఝట్టి: (ప్రవేశించి) అన్నయ్యా! నీ విక్కడనే వుండు. నేను నాయకురాలికి తోడై చినఅన్నయ్యకు దుర్మరణము గలిగించిన యా హంతకుల నంతమొందించి వస్తాను.

నల. రా: తమ్ముడా! అనాథయై వున్న పల్నాటిరాజ్యమునకు నీవే అధిపతివి గమ్ము. ఇచ్చటనే వుండుము. తమ్ముడు లేని రాజ్యము నాకేల?

ఝట్టి: కాదన్నయ్యా! నే బోతాను.

నల. రా: వద్దు. ఇది నా యాజ్ఞగా శిరసావహించుము.

ఝట్టి: వద్దన్నయ్యా.

నల. రా: అసహాయుడనై వున్న నా ఆజ్ఞను నీవూ పాలించవా?

ఝట్టి: చిత్తము. మీ యాజ్ఞ శిరసావహిస్తాను.

నల. రా: ఎవడురా! తేరు....

[ నిష్క్రమణం ]

౨-వ రంగము

కారెంపూడి

[ బ్రహ్మనాయుడు, కొమ్మరాజు ప్రవేశము ]

బ్రహ్మ : నరసింగరాజుయొక్క మరణవార్త విన్నప్పటినుంచీ నాకావేదనగా వున్నది అలరాజు, పినమలిదేవుల మరణములకే మనసున నొగిలిపోతుంటే గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టు నరసింగరాజుమరణము వీరితోపాటు సమానదుఃఖమునే కలిగిస్తున్నది.

కొమ్మ : అతనిమీద అలరాజును చంపించాడనే క్రోధం మన పిల్లలకు పూర్తిగా వున్నదిగాని సత్యం దేవు డెరుగు. తమ్ముడు పోయినవార్త విని పెదమలిదేవుడు యుద్ధానికి పోయినాడు. ఇదేమి కొంపముంచుతుందో !

నా : ( ప్రవేశించి ) మంత్రి మహాప్రభూ ! ఘోరదుర్వార్తలు చెప్పవలసివచ్చినందుకు వెరుస్తున్నాను.

బ్రహ్మ : దేనికయినను వొడిగట్టుకొని సిద్ధముగానే వున్నాను. వెరవక చెప్పు.

కొమ్మ : రాజు క్షేమముగ నున్నాడుగదా !

నా : ఆయనమట్టుకు క్షేమమే కాని మన పక్షమున పేరుగల నాయకులందరు పడిపోయినారు.

బ్రహ్మ : అదియేమి ? చెప్పు, చెప్పు.

నా : నరసింగరాజు పడిపోంగనే నాయకురాలు సర్వసేనాధిపత్యము వహించినది. అగ్గికి కరువలి తోడయినట్లు రాజామెకు బాసటైనాడు. అది యేమిచిత్రమోగాని అదె మొదలు పారిపోతున్నవారి సైన్యములన్నీ కొత్తలై ఘోర

సంగ్రామమునకు దార్తీసినవి. నరసింగభూపతి మరణమునకు కారణమయిన బాలచంద్రునిపై నాయకురాలు, కేతురెడ్డి, కోలంకి వీరాస్వామి, పొన్నాళ్ల రామానాయుడూ, పొదిలె పాపన్న, కల్వగుంట కాశీపతీ మొదలైన వీరానీకమంతా ఒక్కుమ్మడిని దలపడ్డారు. బాలచంద్రుని యుద్ధమును ప్రత్యేకము వర్ణించడముకంటె పద్మవ్యూహమునాటి అభిమన్యుని యుద్ధమును మించినదని చెప్పితే చాలును.

బ్రహ్మ: ఇతరులెవ్వరూ అతనికి తోడ్పడలేదా?

నా: బాలుఁడొంటరిగ నుండుటంగని తమ సోదరులైన పేరినాయుడూ, సూరసీడూ పొంగివచ్చే సేనాసముద్రమున కడ్డమై ఒక్కగడియ ఘోరముగ పోరాడారుగాని నాయకురాలి ఘోరనారాచములకు బలైనారు.

బ్రహ్మ: ఆహా! యేమి వారి పుత్రవాత్సల్యము. బాలచంద్రుడు వంశనాశనకారుడని జ్యోతిష్కులు చెప్పినది వాస్తవమయినది.

నా: అంతట బాలు డొక్కడే వారి క్రౌర్యమున కగ్గమయినాడు. పలువురు క్రూరనారాచముల బరపి, ఈటెలతో బొడిచీ, నిరాయుధుం జేసీ, అంతమొందించారుగాని యాబాలుని పరాక్రమప్రదర్శనము నరులకేకాక దేవతలకూ అద్భుతాశ్చర్యముల గొల్పినది.

బ్రహ్మ: బాలచెన్నా! నివల్పాయుష్కుడవయినా నీ కీర్తి ఆచంద్రతారార్కము విలసిల్లుతుంది!

నా: కన్నమదాసు యెంత ప్రయత్నించినా నాయకురాలి సైన్యము లడ్డుపడడంచేత బాలచంద్రుని జేరలేక, తుద కాతని మరణవార్తనుగూడ విని కసిమసగిన కోల్పులివలె

నాయకురాలిపై కురికి ఆమె రథ్యలను, సారథిని అంత మొందించి రథముపై దుముక నుంకించాడుగాని....

బ్రహ్మ: ఇప్పుడేమి ప్రయోజనము? ఆమె చేయదలంచిన దంతా చేసినది. సంకల్పసిద్ధురాలు.

కొమ్మ: ఇంతలో ఏమి జరిగినది?

నా: బాలుని జంపిన సైన్యములన్నీ పెదమల్లభూపతిపై తిరుగగా, కన్న డామెను విడిచి, బాలుని మరణముచే భయపడి పరుగెత్తుతున్న స్వసైన్యముల బురిగొల్పుకొని, రాజు రక్షణార్థమై బరుగెత్తగా, నామె కేతురెడ్డి రథముపై నెక్కి మల్లభూపతిపై దిరిగినది.

బ్రహ్మ: ఇంకెక్కడి మల్లభూపతి? మన మిక్క డెందుకు? పోదాము లెండి.

[ క ల క ల ము ]

[ కన్నమదాసు - తెరలో ]

చమూపతులారా! అట్లు పిరికివందలై పారిపోతా రేల? మల్లభూపతి యిక్కట్టులో నుండగా ముందంజ వేయరేమి?

బ్రహ్మ: ఎవరురా? రథము, రథము.

క. దా: ( తెరలో ) కుమారా! ఎంతచెప్పినా వినకపోతివిగా. ఎవరూ నామాట విని ప్రభువునకు తోడ్పడేవారు లేరా? మాచర్లమండలాధిపతి, పేర్వడిసిన వీరానీకమునకు నాథు డయిన రాజాగ్రణికే దిక్కులేని చావు సంభవించినదా? అయ్యో! యెంతకష్ట మెంత కష్టము?

బ్రహ్మ: సేనాధ్యక్షుని మాట వినువారుకూడా లేక పోయిరిగా! అంతయు ముగిసినది. మన కిక ప్రపంచముతో

నేమి సంబంధమున్నది ? నాఅన్న వారందరూ పోయినారు. మనము ఆయుధపాణులమై క్షత్రియోచితమయిన మరణమును బొందుదాము రండు. [ నిష్క్రమణం ]

[ మరలవచ్చి ]

బ్రహ్మ : అయ్యా ! ఏల పరువెత్తుతారు ? మన కిహలోక సౌఖ్యము లేకున్నా పరలోకసౌఖ్యమయినా కావలదా ?

[ వెళ్లి, మరలవచ్చి ]

ముందుకు పొండి. పారిపోకండి.

[ వెళ్లిపోతాడు ]

[ ప్రతాపుడు-ప్రవేశము ]

ప్రతా : ఆనందం. బ్రహ్మానందం. మహదానందం. నరకండి. చంపండి. కొయ్యండి. ఎక్కడా ఇదేపని. నేను నటరాజును. నా పల్నాటినాటకము పూర్తవుతున్నది. శృంగార పురుషుడనై యమునాతీరమున తాండవమాడాను. ప్రతాపుడనై కురుక్షేత్రములో, లంకాపురములో విహరించాను. శృంగారపురుషుడు ప్రపంచం సృష్టించడంలో తాండవమాడుతాడు. నేను లయించడంలో తాండవమాడుతాను. నా లీల చూడండి.

## ప్రళయ గీతము

వరాళి - ఖండగతి

ఓ భైరవీదేవి - ఓ భద్రకాళి
భేతాళకాటిగా - పెదపోతరాజ
పుత్రైదండలనొప్పె - భువనైకమాత
శింబోతుచౌడమ్మ - చెండి శివసత్తి

కంతాలు నులిపేటి - కంబాలనాగి
మారెమ్మ అంకమ్మ - మద్దిరామమ్మ
రండెళ్లిపోదాము - రణరంగమునకో.

కత్తులు అంబులు - గండ్రగొడ్డండ్లు
ఈటెలు బాకులు - విచ్చుకత్తులును
పెద్దఫిరంగులు - ఖండివాలములు
రంపాలు బరిసెలు - రహినొప్పబట్టి
ఆవేశపరవశు - లైన సైనికుల
కొవ్విన గుఱ్ఱాల - గొఱ్ఱపొట్టేళ్ల
వీరుల రొమ్ముల - ఏనుగుతలల
చిదిమి ముక్కలుగాగ - చీల్చుతున్నారో.

కారేటి రక్తాన్ని - కలగల్పు జేసి
కడవల బానల - గాబులనిండ
పట్టించి వుంచుతా - పానకంబునకు
తందనాలాడుతూ - తాగుదురుగాని
తలకుబోసుకొనండి - తానమాడండో.

కోట్లాదిశవముల - కోయించినాను
కుప్పలువేయించి - కుళ్లిపోకుండ
యెండబెట్టించాను - కొండలయెత్తు
పీనుగుగుట్టల - పీటలమర్చు
కేరింతలాడుతు - కేకిసలుగొడుతు
బువ్వపుబంతుల - పొలుపుమీరంగ
తిని తిని మీరెల్ల - త్రేపంగవచ్చో.

కండల ముక్కలు - కాకులబట్టి
కుమ్ముమ్మన బెట్టించి - కొద్దిగా కాచి
కరపచ్చిముక్కలు - కమిలిపోకుండ
కొత్తనెత్తుటి ముంచి - కోరలబట్టి
చెలిమెలర క్తము - చిమ్మికారంగ
పలలఖండములను - భక్షింతుగానో.

పుత్రులనెల్లను - పోగుపోయించి
తేరినినీళ్లలో - తెల్లగా గడిగి
పెటపెటలాడంగ - పేలాలువేచి
పొడిపిండిగొట్టించి - బొక్కుదురుగానో.

కోట్లాదిశవముల - గుడ్లు వొలిపించి
నులివెచ్చరక్తము - నూనెయు గలిపి
గంగాళములబట్టి - కనిగుడ్లుబోసి
గట్టిపకోడీల - కరణి వేయించి
భేతాళగణముకు - బెట్టింతు విందో.

[విరామఘంట]

నా లీల నా కానందం.

[నిష్క్రమణం]

## ౩-వ రంగము

### శిబిరం

[బ్రహ్మనాయుడు, కొమ్మరాజు ప్రవేశము]

బ్రహ్మ : అంతా చల్లబడ్డది.
కొమ్మ : కాగి చల్లారిన కాడున్నట్లున్నది.
కేతరాజు : (ప్రవేశించి) అయ్యా! నమస్కారం.

బ్రహ్మ : అంతా ముగిసినదిగదా. విరామఘంట మాకు వీర పురుషోచితమయిన మరణమునుగూడ లేకుండ జేసినది. బ్రతిమలాడినా మమ్ము చంపేవారు లేరు. మీ రేమిపనికై దయచేశారు ?

కేత : నలగామభూపతీ, నాగాంబికా తమ దర్శనమునకే వస్తున్నారు.

బ్రహ్మ : శత్రుశేష ముంచరాదని వస్తున్నారుగాబోలు. మరణము మాకూ ఆనందదాయకమే. ఏదిరా కత్తి !

కేత : వారు పోరాటమునకు రావడంలేదు. తమ్ము క్షమింపుమని వేడుకొనుటకోసం వస్తున్నారు.

బ్రహ్మ : క్షమాపణేల ? క్షత్రియోచితమయిన తమ ధర్మమును వారు నెరవేర్చారు. విజయలక్ష్మి వారిని వరించినది. తప్పక వారి నిచ్చటికి దోడ్కొనిరండు.

[ నలగామరాజు, నాయకురాలు ప్రవేశము ]

నల. రా : అయ్యా ! నమస్కారము.

బ్రహ్మ : శుభమస్తు.

నాయ : మాయం దెన్నిలోపములున్నా క్షమించి మమ్మాశీర్వదింపుడు.

బ్రహ్మ : ఆశీర్వాద మిదివరకే యిచ్చాను. తప్పులు క్షమించేవాడు దేవుడు.

నల. రా : మనలో మనకు అంతఃకలహములు కలిగినందుకు విచారపడుతున్నాను.

బ్రహ్మ : దానికి ఉభయపక్షములూ విచారించవలసినదే. ఒకరి ననవలసినపని లేదు.

నల రా : ఉభయపక్షములా ఆప్తులూ, బంధువులూ యెందరో నశించారు. అది తీరనికొరత.

బ్రహ్మ : అది విధినియతి.

నల. రా : ఇకముందు జరుగవలసిన విధానమును తమరు నిర్ణయించ కర్తలు.

బ్రహ్మ : ఏకచ్ఛత్రాధిపతులై పల్నాటిని మీరు పాలించగోరుతాను. అది భగవద్విధానమని స్పష్టపడినది. శేముషీధురీణయయిన నాగాంబికకంటె సమర్థులయిన మంత్రులు వేరొకరు నాకు గన్పడరు. పల్నాటియందు ఆమెకు మిక్కిలి ప్రేమ.

నాయ : మంత్రిపదవికి అర్హులు తమకంటె వేరొకరు లేరు. ఈ భారము తాము వహించవలసినదని మా ప్రార్థన. నేను నా పశువులను, పశుపతిని సేవించుకో బోతాను. అదియే నే మొదట గోరిన వరము.

బ్రహ్మ : తమ రంగీకరించనిచో కొమ్మరాజుగా రర్హులని నా అభిప్రాయము.

కొమ్మ : ఆ పని నా కక్కరలేదు. ఓపినంతవరకు కత్తిపట్టి పోరాడడందప్ప రాజకీయవ్యవహారములు నాకు తలకెక్కవు.

నల. రా : ఆ పదవి తమరే వహించవలసినది. బహుకాలం మా రాజవంశమూ, మీ మంత్రివంశమూ కలసివస్తున్నవి. సంబంధం విడగొట్టవద్దు.

బ్రహ్మ : చూతాము. ఈ యుద్ధమునకు సంబంధించిన వీరులందరికి కారెంపూడి క్షేత్రములో వర్ణవివక్షత లేక ఆచంద్రతారార్కమూ వీరపూజ యేటేట కార్తీక మాసములో ఉత్సవముతో జరుపవలసినది.

నల. రా : వీరాచారమనే పేరుతో ఈ కట్టుబాటు శాశ్వతముగా జరుగునుగాక !

బ్రహ్మ : మొదటి కొలుపు ఎప్పుడు జేతాం ?

నల. రా : రేపే మొదటి కొలుపు ప్రారంభం.

[ నిష్క్రమణం ]

౮-వ రంగము

[నాగులేటిలోని గంగధారి మడుగు]

[నల. రా; నాయ; బ్రహ్మ - మొదలగు వారు ప్రవేశము]

నల. రా : వీర్ల కొలుపుకు ఏర్పాట్లు జరిగినవా ?

నాయ : ఉత్సవాని కేర్పాట్లు చేయించాము. వీరాలయం కట్టించి దానిలో పల్నాటివీరులు బట్టిన ఆయుధములను నిలిపాము. ఇకముందు యుద్ధములలో చనిపోయే పల్నాటివీరులకుకూడ జాతి మత భేదములేకుండా దీనిలో చోటుంటుంది. తిరునాళ్ల పూర్తిఅయ్యేలోగా వీరచరిత్ర మంతా ప్రతిసంవత్సరమూ బోధించడానికి కొందరి కీనాము లిచ్చి శాశ్వతమైన యేర్పాటు జరిగినది. ఉదయము వీరాచారులందరు ముడుపులూ మొక్కుబళ్ళు చెల్లిస్తారు. అవికాంగనే కొందరు వేషాలుగట్టి వీరచరిత్రంతా నాటకమాడి యుద్ధపట్టులో ఆ యా వీరులు పడ్డచోట పడిపోతారు. దానితో కొలుపు ముగుస్తుంది వీరచరిత్రలు వినీ, కొలుపులు జేసీ మన రాబోయే సంతానము వీర్యవంత మవుతుంది.

నల. రా : నాయుడుగారి సత్యవ్రతసిద్ధాంతాని కిది పొసగుతుందా ?

నాయ : పొసగ కేమి ? ద్వేష ముండకూడదనిమాత్రమే సత్యవ్రతము కోరుతుంది. ప్రతివాడు నిస్సంగుడై యుద్ధము చేయవచ్చును. మన యుద్ధములో ఉభయపక్షములా పోరినవారికి వొకరిమీద వొకరికి ద్వేషము లేదు. చాలమంది బంధువులు కూడాను. స్వలాభంకోసం పోర లేదు. ధర్మంకోసమే ప్రాణములు విడిచారు.

నల. రా : తమ రంగీకరిస్తారా యిది ?

బ్రహ్మ : నా అభిప్రాయం నే జెప్పితే మంచిది. నాగమ్మ గారు చెప్పినది కాదనను. అది మానవధర్మం ; భగవద్గీత దా న్నంగీకరించినది కాని అంతకంటె పై ధర్మ మున్నది. అది సత్యధర్మం. మానవధర్మానికి పై మెట్టు. దీనిలో శత్రువును హింసించడం లేదు. అవసరమైతే శత్రువువల్ల తానే హింసించబడి, దానికి ప్రతిక్రియ తలంపకుండా సహించి, తిరిగి శత్రువును ప్రేమించడమే సత్యవ్రతం.

నాయ : అది నేను కాదనను. ఇప్పట్లో అది సాధ్యమూ కాదు. ప్రయోజనకారీ కాదు.

బ్రహ్మ : అది మానవునిలో గర్భితమై వున్నది. ప్రస్ఫుట మవుతుంది.

నల. రా : అంతవరకు నాగమ్మగారు చెప్పినదే ధర్మం. త్వరలో సత్యధర్మం లోకకళ్యాణ మొడగూర్చుగాక !

[ నిష్క్రమణం - తెరపడుతుంది ]

సంపూర్ణము